# శ్రీమద్భగవద్గీత

భావానువాదం:

డా॥ రావుల సూర్యనారాయణమూర్తి




తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# శ్రీమద్భగవద్గీత

భావానువాదం :

డా॥ రావుల సూర్యనారాయణమూర్తి



ప్రచురణ

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

2008

# SRIMAD BHAGAVADGITA

By
**Dr. Ravula Suryanarayana Murthy**
Editor : **Dr. Chilakapati Vijaya Raghavacharyulu,**
Secretary, H.D.P.P., T T. Devasthanams, Tirupati.

T.T.D Religious Publications Series No·71

Copies : 5000

Published by:
**Sri K.V. Ramanachary**, I A S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati - 517 501.

Printed at:
Tirumala Tirupati Devasthanams Press,
Tirupati - 517 507.

# నిమిత్తమాత్రం భవ

భగవద్గీత సకల వేదసారం బ్రహ్మ విద్య ఉపనిషత్తు సనాతన హిందూ వైదిక సంస్కృతికి కరదీపిక ప్రతి హిందువు 'భగవద్గీత' ను మహిమాన్వితమైన మంత్రంగానూ, జీవన విధానంగానూ, సామాజిక స్పృహను పంచి, పెంచే ఆచరణ ప్రణాళికగాను భావిస్తాడు జీవితంలో ఎదురయ్యే ఉత్థాన పతనాలకు పొంగక, క్రుంగక సమతౌల్యమైన జీవనశైలిని ఇది ప్రతిపాదిస్తోంది అహంకార, మమకారాలనూ, కర్తృత్వ భోక్తృత్వాలనూ, నిందాస్తుతులనూ, జయాపజయా లనూ - అన్నింటిని త్యజించి, తనను మాత్రమే శరణు గోరమనీ, తాను ప్రాపంచికమైన బంధాలనుంచి ఉద్ధరిస్తాననీ, మీ శోకించవలదనీ భగవంతుడైన శ్రీకృష్ణుడు ఇచ్చిన వాగ్దాన పత్రమే "గీత"

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ,
నిర్మమో నిరహంకారః సమ దుఃఖ సుఖః క్షమీ॥ -(12-13)
'కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు కదాచన' -(2-47)
'క్షుద్రం హృదయం దౌర్బల్యం త్య క్త్వోత్తిష్ఠ! పరంతప!'
'సమే ద్వేష్యోఽస్తి న ప్రియః'

ఇలాంటి మహోపదేశాల వెనుక వున్న తాత్త్విక ధార సర్వమానవ సమత్వాన్నీ, నిశ్చల ధ్యాన విధానాన్నీ, కర్మ ఫలత్యాగ వైభవాన్నీ గుర్తు చేస్తూ, సన్మార్గ దర్శనం చేస్తాయి

తి.తి. దేవస్థానం ఇటీవల త్రికరణశుద్ధిగా సంకల్పించి, నిర్విఘ్నంగా సాగిస్తోన్న సామాజిక దైవీకరణ కార్యక్రమాలు, చతుర్యుగబంధ యుక్త భక్తి చైతన్య యాత్రలు 'మనమంతా సోదరులం - భగవంతుడే మనకు తండ్రి' అనే స్ఫూర్తిని సాకారం చేస్తున్నాయి. మనమేపని చేస్తున్నా కేవలం నిమిత్త మాత్రులమేనన్న భావంతో చేస్తూ, ఫలితం భగవంతునిదే అన్న విశ్వాసాన్ని శ్వాసిస్తూ సాగించే కార్యక్రమాలు మనల్ని కర్మబంధ విముక్తుల్నిచేసి, ఆయన అనుగ్రహానికి పాత్రులను చేస్తాయి. ఆ దృష్టితో 'భగవద్గీత' ను అధ్యయనం చేద్దాం ప్రియతమ చదువరులకు తిరుమల తిరుపతి దేవస్థానం ప్రేమపూర్వకంగా అందిస్తోన్న పునర్ముద్రిత కానుక ఇది

(భూమన కరుణాకర రెడ్డి)

తి.తి.దే. పాలకమండలి,తిరుపతి.

# శుభాశంస

భగవద్గీత కృష్ణార్జున సంవాద రూపంలో సంసార సాగరంలో కొట్టు మిట్టాడుచున్న మానవులకు ముక్తి మార్గాన్ని బోధిస్తోంది అంతేగాక మానవులకు జీవితంలో సంభవించే సమస్యలకు చక్కని పరిష్కార మార్గాన్ని చూపుతోంది మహాత్మాగాంధీగారు కూడా తనకెదురైన సమస్యలకు 'గీత' పరిష్కారాలను చూపించిందన్నారు అందుకనే ఇటీవల 'మేనేజిమెంటు కోర్సు' ల్లో కూడ భగవద్గీత తెలిపిన పరిష్కార మార్గాలు బోధింపబడుతున్నాయి. భగవద్గీతా పఠనంతో, కార్యనిర్వహణలో కలిగే సమస్యలతో బాధపడుతున్నవారికి మానసిక ప్రశాంతత కలుగుతోంది ఇట్లు భగవద్గీత ఐహిక జీవితానికి, పారమార్థిక జీవితానికి తోడ్పడుతోంది. ఇది ప్రేయానికీ, శ్రేయానికి దోహదపడే ప్రవర్తనా సంహిత

భగవద్గీతకు శంకరాచార్యులు మొదలుకొని అనేక మంది వ్యాఖ్యానాలు రచించారు. తెలుగులో కూడ అనేక మంది వ్యాఖ్యానాలు రచించియున్నారు

పద్య, గద్య, నాటక, కళారూపాలలో 'భగవద్గీత' పొందినంత ప్రాచుర్యం మరే ఇతర గ్రంథం పొందలేదు! కాని సామాన్యులకు కూడ అర్థమయ్యే భాషలో, సులభ శైలిలో భగవద్గీతకు వ్యాఖ్యానాన్నీ, సారాంశాన్నీ మాన్య శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి రచించారు. లోగడ దీనిని తిరుమల తిరుపతి దేవస్థానం ప్రచురించింది. 'రావుల వారి భగవద్గీత' అశేష భక్తజన ఆదరాన్ని పొందింది ఆ భగవద్గీతను మరల ప్రచురించవలసిన ఆవశ్యకత ఏర్పడింది దీనిని గుర్తించి తిరుమల తిరుపతి దేవస్థానం రావులవారి భగవద్గీతను మరల ముద్రించి, ప్రచారంలోకి తెస్తోంది ఈ గ్రంథం పూర్వం వలెనే పాఠకుల ఆదరాభిమానములను చూరగొనగలదని విశ్వసిస్తున్నాను.

(కె.వి. రమణాచారి, I.A.S.,)
కార్యనిర్వహణాధికారి
తి.తి. దేవస్థానములు, తిరుపతి.

# మనవి

శ్రీమద్భగవద్గీత వేదాంతసారం, తత్త్వజ్ఞాన సర్వస్వం. ఇది మహా భారతంలో ఒక భాగం. భారతీయవాఙ్మయంలో భగవద్గీతకున్న ప్రశస్తి ప్రపంచంలో మరో గ్రంథానికి దేనికీ లేదు.

అనంతమైన దయారసానికివశుడై కురుక్షేత్రంలో యుద్ధ విముఖుడైన అర్జునుడికి రథసారథ్యమే కాకుండా జ్ఞానసారథ్యం కూడా వహించి శ్రీకృష్ణ భగవానుడు చేసిన మహోపదేశం గీత. భగవంతుడు, సంశయగ్రస్తుడైన అర్జునుడి ఆర్తిని తొలగించి, సంసార దుఃఖాన్ని సమూలంగా రూపుమాపే ఆత్మజ్ఞానాన్ని అతనికి ఉపదేశించాడు.

అతి ప్రాచీనకాలం నుంచీ ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలతో సమానమైన ప్రమాణం కలిగి, సంప్రదాయ మత గ్రంథంగా హిందువులు పూజించే భగవద్గీతలోని భావాలు గంభీరాలు. అందులోని శ్లోకాలు సులభంగా అర్థమవుతున్నట్లే వుంటాయి. కాని యథార్థంగా వాటి తత్త్వాన్ని గ్రహించడం కష్ట సాధ్యం.

స్మృతి అని చెప్పబడినప్పటికి భగవద్గీత సూత్రగ్రంథం లాంటిది. ఏ మాటకు ఏ అర్థమో చెప్పలేము. ప్రతి అక్షరంలోనూ, ప్రతి శ్లోకంలోనూ, దైవత్వం తొణికసలాడు తుంటుంది. చిత్తం పరిశుద్ధమయ్యేకొద్దీ సరికొత్త అర్థాలు కానవస్తాయి. నిరంతర సత్యారాధన పరత్వం, నిశ్చల ధ్యాననిష్ఠ, నిర్వికారమోక్షైకాపేక్షాదీక్ష కలిగిన ఎందరెందరో మహానుభావులు ఈ గ్రంథానికి వ్యాఖ్యానాలు వ్రాశారు. అయితే ఎవరెవరు

ఎన్నెన్ని భాష్యాలు వ్రాసినా ఇంకా అనంత విజ్ఞానం అందులో మిగిలే వుంటుంది

భగవద్గీతకు ఇంతవరకూ వచ్చిన అనువాదాలలో అనేకం మూలాన్ని మరింత క్లిష్టతరం చేస్తున్నాయనీ, మూలభావాన్ని తెలుగు పరితలకు తేటతెల్లం చేయడం అవసరమనీ భావించి, నన్ను ఈ రచనకు ప్రోత్సహించిన తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారి గారికి నా కృతజ్ఞతాంజలులు ఈ గ్రంథానువాద విషయంలో సముచిత సలహాలు అందజేసిన సహృదయులు సాహిత్య శిరోమణి శ్రీ సముద్రాల లక్ష్మణయ్యనాయుడుగారికి డా॥ ఎస్. బి. రఘునాథాచార్య గారికి, ముద్రణ విషయంలో శ్రద్ధాసక్తులు వహించిన తి.తి దేవస్థానం ముద్రణాలయం మేనేజరు మరియు వారి సిబ్బందికి నా ధన్యవాదాలు.

భగవద్గీతను భక్తిశ్రద్ధలతో పఠించి, అందులోని భావాలను బాగా ఆచరిస్తే మానవజీవితోద్దేశం సఫలమవుతుంది. సంస్కృత భాష రాకపోయి నప్పటికీ కొంత చిత్త సంస్కారం కలిగిన పాఠకుడికి ఈ భావానువాదం, భగవద్వాణిని సాధ్యమైనంత సుబోధం చేస్తుందని ఆశిస్తున్నాను.

విధేయుడు

రావుల సూర్యనారాయణమూర్తి

# శ్రీ మద్భగవద్గీత

## మొదటి అధ్యాయం

## అర్జునవిషాద యోగం

ధృతరాష్ట్ర ఉవాచ :

ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః।
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ॥ 1

ధృతరాష్ట్రుడు : సంజయా! ధర్మానికి నిలయమైన కురుక్షేత్రంలో యుద్ధ సన్నద్ధులై నిలిచిన నావాళ్ళు, పాండవులు ఏం చేశారు.

సంజయ ఉవాచ :

దృష్ట్వా తు పాండవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా।
ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్॥ 2

సంజయుడు : యుద్ధానికి సంసిద్ధులై వున్న పాండవ సైన్యాలను చూసి, దుర్యోధనుడు ద్రోణాచార్యుల దగ్గరికి వెళ్ళి ఇలా అన్నాడు.

పశ్యైతాం పాండుపుత్రాణాం ఆచార్య! మహతీం చమూమ్।
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా॥ 3

ఆచార్య! మీ శిష్యుడు, ధీమంతుడూ అయిన దృష్టద్యుమ్నుడు వ్యూహం పన్నిన పాండవుల మహా సైన్యాన్ని చూడండి.

అత్ర శూరాః మహేష్వాసాః భీమార్జునసమా యుధి।
యుయుధానో విరాటశ్చ ద్రుపద శ్చ మహారథః॥ 4

ధృష్టకేతు శ్చేకితానః కాశీరాజ శ్చ వీర్యవాన్।
పురుజిత్కున్తిభోజశ్చ శైబ్యశ్చ నరపుఙ్గవః॥ 5

యుధామన్యుశ్చ విక్రాన్త ఉత్తమౌజాశ్చ వీర్యవాన్।
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః॥ 6

ఈ పాండవుల సైన్యంలో ధైర్య సాహసవంతులూ, అస్త్ర విద్యా నిపుణులూ, శౌర్యంలో భీమార్జున సమానులూ ఉన్నారు. సాత్యకి, విరాటుడు, ద్రుపదుడు, ధృష్టకేతువు, చేకితానుడు, కాశీరాజు, పురుజిత్తు, కుంతిభోజుడు, శైబ్యుడు, యుధామన్యుడు, ఉత్తమౌజుడు, అభిమన్యుడు, ఉపపాండవులు కూడా ఉన్నారు. వీళ్ళంతా మహారథులే.

అస్మాకం తు విశిష్టా యే తాన్ని బోధ ద్విజోత్తమ।
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే॥ 7

బ్రాహ్మణోత్తమా! ఇక మన సైన్యంలో వున్న నాయకులూ, సుప్రసిద్ధులూ అయిన వాళ్ల గురించి కూడా చెబుతాను.

భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితిఞ్జయః।
అశ్వత్థామా వికర్ణ శ్చ సౌమదత్తి స్తథైవ చ॥ 8

అన్యేచ బహవశ్శూరాః మదర్థే త్యక్తజీవితాః।
నానా శస్త్ర ప్రహరణాః సర్వే యుద్ధవిశారదాః॥ 9

మీరు, భీష్ముడు, కర్ణుడు, కృపాచార్యుడు, అశ్వత్థామ, వికర్ణుడు, సౌమదత్తి ఉన్నారు. ఇంకా ఎంతో మంది శూరాగ్రేసరులు, యుద్ధవిశారదులు నా కోసం జీవితాల మీద ఆశ వదలి సిద్ధంగా ఉన్నారు.

అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్।
పర్యాప్తం త్విద మేతేషాం బలం భీమాభిరక్షితమ్॥ 10

భీష్ముడు రక్షిస్తున్న మన సైన్యం అపరిమితం. భీముడి రక్షణలో వున్న పాండవ సైన్యం పరిమితం.

అయనేషు చ సర్వేషు యథాభాగ మవస్థితాః।
భీష్మమేవాభిరక్షంతు భవంత స్సర్వ ఏవ హి॥ 11

అందువల్ల మీరంతా యుద్ధరంగంలో మీ మీ స్థానాలు వదిలిపెట్టకుండా ఉండి భీష్మణ్ణి కాపాడాలి.

తస్య సంజనయన్ హర్షం కురు వృద్ధ పితామహః।
సింహనాదం వినద్యోచ్చైః శంఖం దధ్మౌ ప్రతాపవాన్॥ 12

అలా అంటున్న దుర్యోధనుడికి సంతోషం కలిగిస్తూ కురువృద్ధుడైన భీష్ముడు సింహనాదం చేసి శంఖం పూరించాడు.

తత శ్శంఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః।
సహసై వాభ్యహన్యంత స శబ్దస్తుములోఽభవత్॥ 13

వెంటనే కౌరవవీరుల శంఖభేరి ఢక్కామృదంగ గోముఖాది ధ్వనులతో దిక్కులన్నీ పిక్కటిల్లాయి.

తత శ్శ్వేతైర్హయై ర్యుక్తే మహతి స్యందనే స్థితౌ।
మాధవః పాండవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః॥ 14

అప్పుడు తెల్లగుర్రాలు కట్టిన మహారథం మీద కూర్చున్న కృష్ణార్జునులు కూడా తమ దివ్య శంఖాలు పూరించారు.

పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః।
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమ కర్మా వృకోదరః॥ 15

అనంత విజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః।
నకుల స్సహదేవశ్చ సుఘోష మణిపుష్పకౌ॥ 16

కాశ్యశ్చ పరమేష్వాసః శిఖండీ చ మహారథః।
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకి శ్చాపరాజితః॥ 17

ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే।
సౌభద్రశ్చ మహాబాహుః శంఖాన్ దధ్ముః పృథక్పృథక్॥ 18

శ్రీకృష్ణుడు పాంచజన్యం, అర్జునుడు దేవదత్తం, భీముడు పౌండ్రకం ఊదారు. ధర్మరాజు అనంత విజయం, నకుల సహదేవులు సుఘోష మణిపుష్ప కాలు పూరించారు. కాశీరాజు, శిఖండి ధృష్టద్యుమ్నుడు, విరాటుడు, సాత్యకి, ద్రుపదుడు, ఉపపాండవులు, అభిమన్యుడు తమతమ శంఖాలు అన్నివైపులా ఊదారు.

సఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్।
నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్॥ 19

ఆ శంఖ ధ్వనులు భూమి ఆకాశాలను దద్దరిల్లజేస్తూ కౌరవ వీరుల హృదయాలను బద్దలు చేశాయి.

అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః।
ప్రవృత్తే శస్త్ర సంపాతే ధను రుద్యమ్య పాండవః॥ 20

హృషీకేశం తదా వాక్యం ఇద మాహ మహీపతే।
సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మేఽ చ్యుత!॥ 21

అర్జున ఉవాచ : కురురాజా! అప్పుడు అర్జునుడు యుద్ధసన్నద్ధులైన దుర్యోధనాదులను చూసి, గాండీవం ఎత్తినట్టి శ్రీకృష్ణుడితో "అచ్యుతా రెండు సేనల మధ్య నా రధాన్ని నిలబెట్టు" అన్నాడు.

యావ దేతాన్ నిరీక్షేఽహం యోద్ధుకామా నవస్థితాన్।
కైర్మయా సహ యోద్ధవ్యం అస్మిన్ రణసముద్యమే॥ 22

యోత్స్యమానా నవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః।
ధార్త రాష్ట్రస్య దుర్బుద్ధేః యుద్ధే ప్రియచికీర్షవః॥ 23

"కృష్ణా! శత్రు వీరులను చూడనీ, దుష్టుడైన దుర్యోధనుడికి సాయం చేయడానికి సమర రంగానికి వచ్చిన వాళ్లందరినీ చూడాలనుకుంటున్నాను" అన్నాడు అర్జునుడు.

సంజయ ఉవాచ :

**ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత।**
**సేనయో రుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్॥ 24**

**భీష్మ ద్రోణ ప్రముఖతః సర్వేషాం చ మహీక్షితామ్।**
**ఉవాచ పార్థ! పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి॥ 25**

సంజయుడు : ధృతరాష్ట్రా! అర్జునుడి మాటలు ఆలకించిన శ్రీకృష్ణుడు రెండు సేనల మధ్య భీష్మద్రోణాదులకు ఎదురుగా రథం ఆపి, అక్కడ చేరిన కౌరవ బలాన్ని అవలోకించమన్నాడు.

**తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్।**
**ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్ సఖీం స్తథా॥ 26**

**శ్వశురాన్ సుహృదయ శ్చైవ సేనయో రుభయో రపి।**
**తాన్ సమీక్ష్య స కౌన్తేయః సర్వాన్ బంధూనవస్థితాన్॥ 27**

కృపయా పరయాఽఽవిష్టో విషీదన్నిద మబ్రవీత్.

అప్పుడు అర్జునుడు ఉభయ సేనలలోనూ యుద్ధానికి సిద్ధంగా వున్న తన తండ్రులనూ, తాతలను, గురువులను, మేనమామలను, సోదరులను, పుత్రులను, పౌత్రులను, మిత్రులనూ, బంధువులందరినీ చూశాడు. చూసి మిక్కిలి దయగలిగి దుఃఖిస్తూ విశేషకృపాంతరంగుడూ, విషాదవశుడు అయి ఇలా అన్నాడు.

అర్జున ఉవాచ :

దృష్ట్వేమం స్వజనం కృష్ణ! యుయుత్సుం సముపస్థితమ్. 28

సీదంతి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి।

వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే॥ 29

గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే।

న చ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః॥ 30

కృష్ణా! యుద్ధాసక్తులై ఎదురుగా ఉన్న చుట్టాలను చూడగానే నా అవయవాలు తడబడుతున్నాయి. నోరు ఎండిపోతున్నది. శరీరమంతా గగుర్పాటుతో కంపిస్తున్నది. గాండీవం చేతిలోంచి జారిపోతుంది. దేహం మండుతున్నది. నిలబడడానికి కూడా శక్తి లేదు. నా మనస్సు తల్లడిల్లు తున్నది.

నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ।
న చ శ్రేయో౽ నుపశ్యామి హత్వా స్వజన మాహవే॥ 31

కేశవా! దుశ్శకునాలు కానవస్తున్నాయి. యుద్ధంలో బంధువులను చంపడం వల్ల కలిగే మేలు ఏమీ గోచరించడం లేదు.

న కాంక్షే విజయం కృష్ణ! న చ రాజ్యం సుఖాని చ।
కిం నో రాజ్యేన? గోవింద! కిం భోగై ర్జీవితేన వా?॥ 32

కృష్ణా! యుద్ధ విజయం మీద, రాజ్యసుఖాలమీద నాకు ఆసక్తి లేదు రాజ్య భోగాలతో కూడిన జీవితం వల్ల ప్రయోజనం ఏమీ లేదు.

యేషా మర్థే కాంక్షితం నో రాజ్యం భోగాస్సుఖాని చ।
త ఇమే౽ వస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ॥ 33

ఆచార్యాః పితరఃపుత్రాః తథైవ చ పితామహాః।
మాతులాశ్శ్వశురాః పౌత్రాః స్యాలాస్సంబంధిన స్తథా॥ 34

ఎవరి కోసం రాజ్యం, భోగం, సుఖం, కోరుతున్నామో వాళ్లంతా గురువులు, తండ్రులు, కుమారులు, తాతలు, మేనమామలు, మామలు, మనుమలు, బావ మరుదులు, ఇతర బంధువులూ -- ధనప్రాణాల మీద ఆశ వదిలి ఈ రణ రంగంలోనే వున్నారు.

**ఏతా న్న హంతు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన।**
**అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిం ను మహీకృతే॥ 35**

మధుసూదనా! వాళ్లు నన్ను చంపితే చంపనీ, ముల్లోకాలనూ ఏలే అవకాశం కలిగినా నేను మాత్రం వాళ్లను వధించదలచుకోలేదు. అలాంటప్పుడు ఈ రాజ్యం కోసం వాళ్లను చంపుతానా?

**నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతి స్స్యా జ్జనార్దన?।**
**పాపమేవాశ్రయేదస్మాన్ హత్వైతా నాతతాయినః॥ 36**

దుర్యోధనాదులను సంహరించి మనం పొందే సంతోషమేమిటి? జనార్దన! ఈ పాపాత్ములను చంపితే మనకూ పాపమే.

**తస్మాన్నార్హా వయం హంతుం ధార్త రాష్ట్రాన్ స్వబాంధవాన్।**
**స్వజనం హి కథం హత్వా సుఖిన స్స్యామ మాధవ!॥ 37**

బంధువులైన దుర్యోధనాదులను చంపడం మనకు మంచిది కాదు. మాధవా! స్వజనాన్ని వధించి ఎలా సుఖపడగలం?

**యద్య ప్యేతే న పశ్యంతి లోభోపహతచేతసః।**
**కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్॥ 38**

రాజ్యకాంక్షాపరులైన కౌరవులు వంశనాశనం, మిత్రద్రోహం వల్ల కలిగే పాతకాన్ని గ్రహించలేక పోతున్నారు.

కథం న జ్ఞేయ మస్మాభిః? పాపాదస్మాన్నివర్తితుమ్।
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భి ర్జనార్దన!॥ 39

జనార్థనా! వంశ క్షయంవల్ల వచ్చే దోషాన్ని బాగా తెలిసిన మనము ఆ పాపం నుంచి ఎందుకు తప్పించుకోకూడదు?

కులక్షయే ప్రణశ్యంతి కులధర్మా స్సనాతనాః।
ధర్మే నష్టే కులం కృత్స్నం అధర్మోఽభిభవత్యుత॥ 40

వంశనాశనంతో ప్రాచీన కుల ధర్మాలు నశిస్తాయి. వంశమంతటా అధర్మం అలుముకుంటుంది.

అధర్మాఽభిభవాత్కృష్ణ! ప్రదుష్యన్తి కులస్త్రియః।
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః॥ 41

కృష్ణా! అధర్మం ప్రబలితే కులస్త్రీలు చెడిపోతారు. దానితో జాతి సంకరం జరుగుతుంది.

సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ।
**పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదక క్రియాః॥ 42**

వర్ణసంకరంవల్ల కులానికీ, కులనాశకులకూ కలిగేది నరకమే. వారి పితృ దేవతలు పిండోదక కార్యాలు లేక అధోగతి పాలవుతారు.

**దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః।**
**ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః॥ 43**

కులాన్ని నాశనం చేసే వాళ్ల మూలంగా కలిగే వర్ణ సాంకర్యం కారణంగా శాశ్వతాలైన జాతి ధర్మాలు, కుల ధర్మాలు అడుగంటి పోతాయి.

**ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన।**
**నరకే నియతం వాసో భవతీత్యనుశుశ్రుమ॥ 44**

జనార్దనా! కులధర్మాలు నశించిన కుటుంబాలవారు శాశ్వత నరకవాసులవుతారని వింటున్నాము.

**అహో! బత! మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్।**
**యద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజన ముద్యతాః॥ 45**

ఎంత ఆశ్చర్యం! రాజ్య లోభంతో బంధువులను చంపడానికి పూనుకొని ఘోర పాపాలు చేయడానికి సిద్ధపడ్డాము కదా!

**యది మామప్రతీకారం అశస్త్రం శస్త్రపాణయః।**
**ధార్తరాష్ట్రా రణే హన్యుః తన్మే క్షేమతరం భవేత్॥ 46**

ఆయుధాలు ధరించిన ధార్త రాష్ట్రులు అస్త్రశస్త్రాలు విసర్జించిన నన్ను యుద్ధంలో సంహరిస్తే అది నాకు మరింత మంచిది.

సంజయ ఉవాచ

**ఏవ ముక్త్వాఽర్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్।**
**విసృజ్య సశరం చాపం శోక సంవిగ్న మానసః॥ 47**

సంజయుడు : అర్జునుడు అలా చెప్పి దుఃఖాక్రాంతుడై విల్లమ్ములు విడిచి పెట్టి రణరంగంలో రథం మీద చతికిలబడ్డాడు.

**ఇలా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రం, శ్రీకృష్ణార్జున సంవాదం అయిన శ్రీమద్భగవద్గీతలోని "అర్జున విషాదయోగం" అనే మొదటి అధ్యాయం సమాప్తం.**

## అధ్యాయ సారాంశ శ్లోకము

**యద్యప్యేతేన పశ్యన్తి లోభోపహత చేతసః।**

**కులక్షయ కృతం దోషం మిత్రద్రోహేచ పాతకమ్॥**

ఓ శ్రీకృష్ణా! రాజ్యలోభంచేత దుష్ట మనస్తత్వం కలిగిన దుర్యోధనాదులు వంశ నాశనంవల్ల కలిగే దోషాన్నీ, మిత్రద్రోహంవల్ల కలిగే పాపాన్నీ తెలుసుకోలేకపోతున్నారు.

కాబట్టి ఇవి పాతకములని తెలిసిన మనము మరల ఈ పాపాలనే చేయుటం దేనికి? అని అర్జునుడు కృష్ణునితో తన సందేహాన్ని వెలిబుచ్చాడు. కావున దీనివలన లోకంలో ఎవరూ తన స్వార్థంకోసం ఇతరులకు ద్రోహం చేయకూడదు.



# శ్రీ మద్భగవద్గీత

## రెండవ అధ్యాయం

## సాంఖ్య యోగం

సంజయ ఉవాచ

తం తథా కృపయా ఽఽవిష్టం అశ్రుపూర్ణాకులేక్షణమ్।
విషీదంత మిదం వాక్యం ఉవాచ మధుసూదనః॥ 1

శ్రీ భగవానువాచ

కుతస్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్?
అనార్యజుష్ట మస్వర్గ్యం అకీర్తికర మర్జున॥ 2

క్లైబ్యం మా స్మ గమః పార్థ! నైతత్త్వ య్యుపపద్యతే।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప॥ 3

సంజయుడు : దయామయుడైన అర్జునుడు కన్నీరు కారుస్తుండగా శ్రీ కృష్ణపరమాత్మ ఇలా అన్నాడు.

అర్జునా! ఈ సంక్లిష్ట సమయంలో అర్యధర్మ విరుద్ధమూ, అపకీర్తి దాయకమూ, నరకప్రాప్తి హేతువూ అయిన ఈ పాడుబుద్ధి నీ కెందుకు పుట్టింది? నపుంసకుడిలాగ అధైర్యం పొందకు. ఇది నీకు పనికిరాదు. మనో దౌర్బల్యం నీచం. దాన్ని విడిచిపెట్టు. నీవు శత్రుమర్దనుడవు కదా! యుద్ధం ప్రారంభించు.

అర్జున ఉవాచ .

కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన।
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన॥ 4

అర్జునుడు : మధుసూదనా! పూజార్హులైన భీష్మ ద్రోణాదులను బాణాలతో నేనెలా కొట్టగలను?

గురూనహత్వా హి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష్య మపీహ లోకే।
హత్వార్థకామాంస్తు గురూ నిహైవ
భుంజీయ భోగాన్ రుధిర ప్రదిగ్ధాన్॥ 5

మహానుభావులైన గురువులను చంపడం శ్రేయస్కరం కాదు. వారిని సంహరించి రక్తసిక్తాలైన రాజ్యభోగాలు అనుభవించడం కంటే బిచ్చమెత్తు కోవడం మేలు.

న చైత ద్విద్మః కతరన్నో గరీయో
యద్వా జయేమ యది వా నో జయేయుః।
యానేవ హత్వా న జిజీవిషామః
తేఽ వస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః॥ 6

యుద్ధం చేయడం మంచిదో కాదో తెలియడంలేదు. మనం జయిస్తామో వారు జయిస్తారో చెప్పలేము ఎవరిని చంపితే మనకు జీవితం మీద విరక్తి కలుగుతుందో ఆ ధార్తరాష్ట్రాదులే ఎదురుగా వున్నారు.

కార్పణ్య దోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మ సమ్మూఢచేతాః।
యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేఽ హం శాధి మాం త్వాం ప్రపన్నమ్॥ 7

గురువులూ బంధువులూ అనే మమకార దోషంవల్ల నా బుద్ధి నశించింది. మంచి ఏదో తెలియడం లేదు. శిష్యుడిగా నిన్ను ఆశ్రయించిన నాకు ఏది శ్రేయోమార్గమో దాన్ని ఆదేశించు.

**న హి ప్రపశ్యామి మమాపనుద్యాత్**
**య చ్ఛోక ముచ్ఛోషణ మింద్రియాణామ్।**
**అవాప్య భూమా వసపత్న మృద్ధం**
**రాజ్యం సురాణా మపి చాధిపత్యమ్॥ 8**

భూలోకాధిపత్యం లభించినా, స్వర్గాధిపత్యం సిద్ధించినా నా శోకం తగ్గుతుందనుకోకు.

సంజయ ఉవాచ :

**ఏవ ముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః।**
**న యోత్స్య ఇతి గోవిందం ఉక్త్వా తూష్ణీం బభూవ హ॥ 9**

సంజయుడు : అర్జునుడు శ్రీకృష్ణుడితో అలాచెప్పి యుద్ధం చేయనని ఊరుకున్నాడు.

**త మువాచ హృషీకేశః ప్రహస న్నివ భారత।**
**సేనయో రుభయో ర్మధ్యే విషీదన్తమిదం వచః॥ 10**

రెండు సేనల మధ్య విషాదవశుడైవున్న అర్జునుణ్ణి చూసి శ్రీ కృష్ణ పరమాత్ముడు పరిహాసంగా ఇలా అన్నాడు.

శ్రీ భగవా నువాచ

**అశోచ్యా నన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే।**
**గతాసూ నగతాసూంశ్చ నానుశోచన్తి పణ్డితాః॥ 11**

అర్జునా! దుఃఖించ నవసరం లేని వాళ్లకోసం దుఃఖిస్తున్నావు. పైగా మహావివేకిలాగ మాట్లాడుతున్నావు చచ్చిపోయినవాళ్ల గురించికాని, బ్రతికున్న వాళ్ల గురించికాని వివేకులు శోకించరు.

నత్వే వాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః।
న చైవ న భవిష్యామః సర్వే వయ మతః పరమ్॥ 12

నీవు నేనూ వీళ్లంతా గతంలోనూ వున్నాము. భవిష్యత్తులో కూడా వుంటాము.

**దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా।**
**తథా దేహాన్తర ప్రాప్తిః ధీర స్తత్ర న ముహ్యతి॥ 13**

జీవుడికి ఈ శరీరంలో కౌమారం, యౌవనం, వార్ధక్యం వచ్చినట్లే మరణానంతరం మరో శరీరం వస్తుంది. ఇందుకు ధీరుడు దుఃఖించడు.

**మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ! శీతోష్ణ సుఖదుఃఖదాః।**
**ఆగమాపాయినోఽ నిత్యాః తాం స్తితీక్షస్వ భారత!॥ 14**

కుంతీపుత్రా! విషయాలకు వశమైన ఇంద్రియాలవల్ల శీతోష్ణాది గుణాలూ, సుఖదుఃఖాలూ కలుగుతుంటాయి. కోరికలకూ, ఇంద్రియాలకూ కలయిక అశాశ్వతం. కనుక ఓ భరతవీరా! ఆ బాధలను సహించు.

**యం హి నవ్యధయన్త్యేతే పురుషం పురుషర్షభ!।**
**సమదుఃఖసుఖం ధీరం సోఽ మృతత్వాయ కల్పతే॥** 15

పురుషవర్యా! శీతోష్ణ సుఖదుఃఖాదులు ఎవడిని బాధించవో అలాంటి ధీరుడే ముక్తికి అర్హుడు.

**నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః।**
**ఉభయోరపి దృష్టోఽన్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః॥** 16

లేనిది ఎప్పటికి వుండదు. ఉన్నది ఎప్పటికి లేకపోదు. రెండింటి నిర్ణయం తత్త్వజ్ఞులకే తెలుస్తుంది.

**అవినాశి తు తద్విద్ధి యేన సర్వ మిదం తతమ్।**
**వినాశ మవ్యయ స్యాస్య న కశ్చిత్కర్తుమర్హ తి॥** 17

ఈ విశ్వమంతటా వ్యాపించివున్న ఆత్మవస్తువు నాశనం లేనిది. దాని నెవరూ అంతం చేయలేరు.

అన్తవన్త ఇమే దేహాః నిత్య స్యోక్తా శ్శరీరిణః।
అనాశినోఽ ప్రమేయస్య తస్మా ద్యుద్ధ్యస్వ భారత! ॥ 18

నాశనం లేని ఆత్మకు ఈ శరీరాలు శాశ్వతాలు కావు. ఆత్మ ఒక్కటే నిత్యం. కనుక ఓ భారత వీరా! యుద్ధము మొదలుపెట్టు.

య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్।
ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే॥ 19

ఈ ఆత్మ చంపుతుందని కాని, చంపబడుతుందని కాని భావించే వాళ్లిద్దరూ అజ్ఞానులే. ఆత్మ చంపేది కాని చచ్చేది కాని కాదు.

న జాయతే మ్రియతే వా కదాచిత్
నాయం భూత్వా భవితా వా న భూయః।
అజో నిత్య శ్శాశ్వతోఽ యం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే॥ 20

ఆత్మకు పుట్టడం చావడం అనేవి లేవు. అది ఒకప్పుడు ఉండి, మరొకప్పుడు లేకపోవడం జరగదు. జన్మరహితమూ, శాశ్వతమూ, అనాది సిద్ధమూ, అయిన ఆత్మ నిత్యం. అందువల్ల శరీరాన్ని నాశనంచేసినా అందులోని ఆత్మమాత్రం చావదు.

వేదావినాశినం నిత్యం య ఏవ మజ మవ్యయమ్।
కథం స పురుషః పార్థ! కం ఘాతయతి హన్తి కమ్॥ 21

పార్థా! ఆత్మ నాశనరహితమనీ, చావు పుట్టుకలు లేనిదనీ, శాశ్వతమైన దనీ తెలుసుకున్నవాడు ఎవరినైనా ఎలా చంపుతాడు? ఎలా చంపిస్తాడు.

వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరో౽ పరాణి।
తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహీ॥ 22

మానవుడు చినిగిపోయిన పాతబట్టలను విడిచిపెట్టేసి కొత్తబట్టలు వేసుకున్నట్లే ఆత్మ కృశించిన శరీరాలను వదిలి కొత్త దేహాలు పొందుతుంది.

నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః।
న చైనం క్లేదయ న్త్యాపో న శోషయతి మారుతః॥ 23

ఈ ఆత్మను ఆయుధాలు నరకలేవు. అగ్ని కాల్చలేదు, నీరు తడుప లేదు, గాలి ఎండబెట్టలేదు.

అచ్ఛేద్యో౽ య మదాహ్యో౽ యం అక్లేద్యో౽ శోష్య ఏవ చ।
నిత్య స్సర్వగతః స్థాణుః అచలోయం సనాతనః॥ 24

ఆత్మ ఖండించరానిది, కాలనిది, తడవనిది, ఎండనిది, అది నిత్యం, సర్వవ్యాప్తం, శాశ్వతం, చలనరహితం, సనాతనం.

**అవ్యక్తోఽ యమచింత్యోఽ యం అవికార్యోఽ యముచ్యతే।**
**తస్మాదేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి॥ 25**

ఆత్మ జ్ఞానేంద్రియాలకు గోచరించదు. మనస్సుకు అందదు. వికారాలకు గురికాదు. ఈ ఆత్మతత్వం తెలుసుకుని నీవు విచారించడం మాను.

**అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్।**
**తథాఽ పి త్వం మహాబాహో! నైవం శోచితు మర్హసి॥ 26**

అర్జునా! శరీరంతోపాటు ఆత్మకు కూడా సదా చావు పుట్టుకలుంటాయని భావిస్తున్నప్పటికీ నీవిలా శోకించవలసిన వనిలేదు.

**జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ।**
**తస్మా దపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి॥ 27**

పుట్టిన వాడికి చావు తప్పదు. చచ్చిన వాడికి పుట్టుక తప్పదు. తప్పించ రాని ఆ విషయంలో తపించ నవసరంలేదు.

అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత।।
అవ్యక్త నిధనా న్యేవ తత్ర కా పరిదేవనా।। 28

జీవులు పుట్టుకకు పూర్వం కాని, మరణానంతరం కాని ఏ రూపంలో వుంటాయో తెలియదు. మధ్యకాలంలో మాత్రమే కనబడుతాయి. అర్జునా! అలాంటప్పుడు విచారమెందుకు?

ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చి దేనం ఆశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః।
ఆశ్చర్యవచ్చైన మన్యః శ్శృణోతి శ్రుత్వా ప్యేనం వేదన చైవ కశ్చిత్।। 29

ఒకడు ఈ ఆత్మను ఆశ్చర్యంగా చూస్తున్నాడు. ఇంకొకడు దీన్ని గురించి విచిత్రంగా మాట్లాడుతున్నాడు. మరొకడు వింతగా వింటున్నాడు. అయితే ఈ ఆత్మ స్వరూప స్వభావాలు తెలుసుకున్న వాడు ఒక్కడూ లేడు.

దేహీ నిత్య మవధ్యోఽ యం దేహే సర్వస్య భారత।।
తస్మా త్సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హ సి।। 30

అన్ని దేహాలలోనూ వుండే ఆత్మకు చావు అనేది లేదు. అందువల్ల ఈ ప్రాణుల గురించి నీవు దుఃఖించ నక్కరలేదు.

స్వధర్మ మపి చావేక్ష్య న వికంపితు మర్హ సి।
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽ న్యత్ క్షత్రియస్య న విద్యతే॥ 31
నీ ధర్మాన్ని తెలుసుకుని అయినా నీవు జంకకు. ఎందుకంటే క్షత్రియుడికి ధర్మయుద్ధాన్ని మించిన మహాభాగ్యం మరొకటి లేదు.

యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతమ్।
సుఖినః క్షత్రియాః పార్థ! లభన్తే యుద్ధ మీదృశమ్॥ 32
తెరచివుంచిన స్వర్గద్వారం లాంటి ఈ సంగ్రామం నీకు అప్రయత్నంగా లభించింది. ఇలాంటి సదవకాశం పుణ్యం చేసుకున్న క్షత్రియులే పొంద గలుగుతారు.

అథ చేత్త్వ మిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి।
తతః స్వధర్మం కీర్తిం చ హిత్వా పాప మవాప్స్యసి॥ 33
నీవు ఈ ధర్మయుద్ధం చేయకపోతే నీ కులధర్మమూ, పేరు ప్రఖ్యాతులూ పాడుచేసి పాపం కట్టుకుంటావు.

అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తేఽ వ్యయామ్।
సంభావితస్య చాకీర్తిః మరణా దతిరిచ్యతే॥ 34

అంతే కాకుండా నీ అపకీర్తిని ప్రజలు చిరకాలం చెప్పుకుంటారు. పరువు ప్రతిష్ఠ లున్నవాడికి అపనిందకంటే మరణమే మంచిది

**భయాద్రణా దుపరతం మన్యన్తే త్వాం మహారథాః।**
**యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్॥ 35**

ఇన్నాళ్ళూ నిన్ను మహావీరుడిగా గౌరవిస్తున్న వాళ్ళంతా భయపడి యుద్ధం మానేశావని భావించి చులకనగా చూస్తారు.

**అవాచ్యవాదాంశ్చ బహూన్ వదిష్యన్తి తవా హితాః।**
**నిన్దన్త స్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్॥ 36**

నీ శత్రువులు నీ పరాక్రమాన్ని నిందిస్తూ అనరాని మాటలెన్నో అంటారు. అంతకుమించిన దుఃఖమేముంది?

**హతో వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్।**
**తస్మాదుత్తిష్ఠ కౌన్తేయ! యుద్ధాయ కృతనిశ్చయః॥ 37**

అర్జునా! ధర్మయుద్ధంలో మరణిస్తే స్వర్గం పొందుతావు. శత్రువులను జయిస్తే రాజ్యభోగాలు అనుభవిస్తావు. అందువల్ల కృతనిశ్చయంతో యుద్ధానికి నడుం బిగించు.

సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి॥ 38

సుఖదుఃఖాలూ, లాభనష్టాలు, జయాపజయాలూ సమానంగా భావించి సమరం సాగించు. అప్పుడు నీకు పాపం కలగదు.

ఏషా తేఽ భిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు।
బుద్ధ్యా యుక్తో యయా పార్థ కర్మబంధం ప్రహాస్యసి॥ 39

పార్థా! ఇంతవరకూ నీకు సాంఖ్యమతానుసారం ఆత్మతత్త్వం గురించి చెప్పాను. ఇక సంసారబంధం వదులుకోవడానికి సాధనమైన నిష్కామ కర్మయోగం గురించి చెబుతాను విను.

నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే।
స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్॥ 40

ఈ కర్మయోగం ప్రారంభించి, పూర్తి చేయలేకపోయినా వృధాగా పోదు, దోషం లేదు. ఏ కొద్దిగా ఆచరించినా ఈ యోగం దారుణమైన సంసారభయం నుంచి కాపాడుతుంది.

వ్యవసాయాత్మికా బుద్ధిః ఏకేహ కురునందన!
బహుశాఖా హ్యనన్తాశ్చ బుద్ధయో౽ వ్యవసాయినామ్॥ 41

కురునందనా! నిశ్చయాత్మకమైన బుద్ధి ఒకే విధంగా వుంటుంది. స్థిర సంకల్పం లేనివాళ్ళ ఆలోచనలు పరిపరివిధాల పరుగులెడతాయి.

యామిమాం పుష్పితాం వాచం ప్రవదంత్యవిపశ్చితః।
వేదవాదరతాః పార్థ! నాన్య దస్తీతి వాదినః॥ 42

కామాత్మాన స్స్వర్గపరాః జన్మకర్మఫల ప్రదామ్।
క్రియావిశేష బహూళాం భోగైశ్వర్యగతిం ప్రతి॥ 43

భోగైశ్వర్య ప్రసక్తానాం తయాపహృతచేతసామ్।
వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే॥ 44

పార్థా! అవివేకులూ, అర్థవాదాలపట్ల ఆసక్తి కలవాళ్ళూ, స్వర్గసుఖాలకు మించి మరొకటి లేదని వాదించేవాళ్ళూ వేదవాక్యాలు పలుకుతుంటారు. అలాంటి వాళ్ళు తాము చేసిన వైదిక కర్మల ఫలితంగా స్వర్గసుఖాలు అనుభవించాక, వాళ్లకు మళ్లీ కర్మభూమిలో పునర్జన్మరూపమైన కర్మఫలమే

తప్ప మోక్షం లభించదు. భోగభాగ్యాలు కోరి వేదవాక్యాలకు వశులైనవారి బుద్ధి నిలకడగా వుండదు.

త్రైగుణ్యవిషయా వేదాః నిస్త్రైగుణ్యో భవార్జున।
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్॥ 45

అర్జునా! వేదాలు మూడు గుణాలు కలిగిన కర్మకాండలను వివరిస్తాయి. నీవు త్రిగుణాలనూ విడిచిపెట్టి, ద్వంద్వాలు లేనివాడవై యోగక్షేమాలు కోరకుండా శుద్ధసత్త్వగుణం అవలంభించి ఆత్మజ్ఞానివి కావాలి.

యావా నర్థ ఉదపానే సర్వత స్సంప్లుతోదకే।
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః॥ 46

నది నుంచి నీరు తెచ్చుకునేవాళ్లు నూతికి ఎలా ప్రాముఖ్య మివ్వరో అలాగే బ్రహ్మజ్ఞానులు ప్రతిఫలాపేక్షతో కూడిన వేదకర్మలకు ప్రాధాన్యం యివ్వరు.

కర్మణ్యే వాధికార స్తే మా ఫలేషు కదాచన।
మా కర్మఫలహేతూర్భూః మా తే సంగో౽స్త్వకర్మణి॥ 47

కర్మలు చేయడం వరకే నీకు అధికారం. కర్మఫలంతో నీకు సంబంధం లేదు. కనుక ప్రతిఫలం ఆశించి కర్మచేయకు. అలా అని కర్మలు మానడానికి చూడకు.

**యోగస్థః కురు కర్మాణి సంఙ్గం త్యక్త్వా ధనంజయం।**
**సిద్ధ్యసిద్ధ్యో స్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే॥ 48**

ఫలం దక్కినా దక్కక పోయినా కర్మలు సమభావనతో సాగించు. అర్జునా! ఈ సమదృష్టినే యోగమంటారు.

**దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ!।**
**బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః॥ 49**

ధనంజయా! ప్రతిఫలాపేక్షతో ఆచరించే కర్మ నిష్కామ కర్మకంటే హీనం. ఫలితం ఆశించి కర్మచేసేవాళ్లు అల్పులు. అందువల్ల నీవు సమ బుద్ధినే ఆశ్రయించు.

**బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృత దుష్కృతే।**
**తస్మా ద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్॥ 50**

సమభావన కలిగిన పురుషుడు పుణ్యపాపాలు రెండింటినీ ఈ లోకంలోనే వదిలేస్తున్నాడు. కనుక సమత్వబుద్ధి అయిన సిష్కామకర్మనే నీవు ఆచరించు. కౌశలంతో కర్మలు చేయడమే యోగమని తెలుసుకో.

**కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః।**
**జన్మబంధ వినిర్ముక్తాఃపదం గచ్ఛ న్త్యనామయమ్॥ 51**

నిష్కామయోగులు కర్మఫలం ఆశించకుండా జన్మబంధాలనుంచి తప్పించుకుని, ఉపద్రవంలేని మోక్షం పొందుతున్నారు.

**యదా తే మోహకలిలం బుద్ధి ర్వ్యతితరిష్యతి।**
**తదా గన్తాఽ సి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ॥ 52**

నీ బుద్ధి అజ్ఞానమనే కల్మషాన్ని అధిగమించినప్పుడు నీకు విన్న విషయాలూ, వినబోయే అర్థాలూ విరక్తి కలిగిస్తాయి.

**శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా।**
**సమాధావచలా బుద్ధిః తదా యోగ మవాప్స్యసి॥ 53**

అర్థవాదాలు అనేకం వినడంవల్ల చలించిన నీ మనస్సు నిశ్చలంగా వున్నప్పుడు నీవు ఆత్మజ్ఞానం పొందుతావు.

అర్జున ఉవాచ :

స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ॥
స్థితధీః కిం ప్రభాషేత? కి మాసీత వ్రజేత కిమ్?॥ 54

అర్జునుడు : కేశవా! సమాధినిష్ఠ పొందిన స్థితప్రజ్ఞుడి లక్షణా లేమిటి? అతని ప్రసంగమూ, ప్రవర్తనా ఎలా ఉంటాయి.

శ్రీ భగవానువాచ :

ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ! మనోగతాన్!
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే॥ 55

శ్రీ కృష్ణభగవానుడు : మనసులోని కోరిక లన్నిటినీ విడిచిపెట్టి, ఎప్పుడూ ఆత్మానందమే అనుభవించేవాడు స్థితప్రజ్ఞుడు.

దుఃఖే ష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః॥
వీత రాగ భయ క్రోధః స్థితధీ ర్ముని రుచ్యతే॥ 56

దుఃఖాలకు క్రుంగనివాడూ, సుఖాలకు పొంగనివాడూ, భయమూ రాగద్వేషాలూ వదిలిపెట్టినవాడూ అయిన మునీంద్రుడు స్థితప్రజ్ఞుడవుతాడు.

యః సర్వత్రానభిస్నేహః తత్తత్ ప్రాప్య శుభాశుభమ్।
నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 57

స్నేహవ్యామోహాలు లేకుండా వ్యవహరిస్తూ శుభాశుభాలు కలిగినప్పుడు సంతోషం, ద్వేషం పొందకుండా వుండేవాడు స్థితప్రజ్ఞుడు.

యదా సంహరతే చాయం కూర్మోంఽగా నీవ సర్వశః।
ఇంద్రియా ణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 58

తాబేలు తన అవయవాలను లోపలికి ఎలా ముడుచుకుంటుందో అలాగే ఇంద్రియాలను సర్వవిధాల విషయసుఖాలనుంచి మళ్లించిన వాడు స్థితప్రజ్ఞుడవుతాడు.

విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః।
రసవర్జం రసోఽ ప్యస్య పరం దృష్ట్వా నివర్తతే॥ 59

ఆహారం తీసుకోనివాడికి ఇంద్రియ విషయాలు అణగిపోతాయి. అయితే విషయ వాసన మాత్రం వదలదు. ఆత్మదర్శనంతో అది కూడా అడుగంటిపోతుంది.

యతతో హ్యపి కౌన్తేయ! పురుషస్య విపశ్చితః।
ఇంద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః॥ 60

కుంతీనందనా! ఆత్మనిగ్రహం కోసం అమితంగా ప్రయత్నించే విద్వాంసుడి మనసును సైతం ఇంద్రియాలు బలవంతంగా లాగుతాయి.

తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః।
వశే హి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 61

యోగసాధకుడు ఇంద్రియా లన్నింటినీ వశపరుచుకుని నామీదే మనస్సు వుంచాలి. అలాంటివాడి ప్రజ్ఞ సుస్థిరమవుతుంది.

ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే।
సంగాత్ సంజాయతే కామః కామాత్ క్రోధోఽ భిజాయతే॥ 62

క్రోధా ద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః।
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశః బుద్ధినాశాత్ ప్రణశ్యతి॥ 63

ఎప్పుడూ శబ్దాది విషయాల గురించే ఆలోచించే వాడికి వాటిమీద ఆసక్తి బాగా పెరుగుతుంది. ఆసక్తివల్ల కోరికలు పుడతాయి. కోరికలు కోపం కలగజేస్తాయి.

కోపం మూలంగా అవివేకం కలుగుతుంది. అవివేకంవల్ల మరపు, మరపువల్ల బుద్ధి నశించడం, బుద్ధి నాశనంవల్ల తానే నశించడం జరుగుతుంది.

**రాగద్వేష వియుక్తైస్తు విషయా నింద్రియై శ్చరన్।**
**ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి॥ 64**

మనసును నిగ్రహించుకుని రాగద్వేషాలు లేకుండా తన అదుపాజ్ఞలలో వున్న ఇంద్రియాల వల్ల విషయ సుఖాలు అనుభవించేవాడు మనశ్శాంతిని పొందుతాడు.

**ప్రసాదే సర్వ దుఃఖానాం హాని రస్యోపజాయతే।**
**ప్రసన్న చేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే॥ 65**

మనస్సు నిర్మలమైతే సమస్త దుఃఖాలూ సమసిపోతాయి. మనసు నిర్మలంగా వున్నవాడి ప్రజ్ఞకు చలనం లేదు.

**నాస్తి బుద్ధి రయుక్తస్య న చాయుక్తస్య భావనా।**
**న చాభావయత శ్శాంతిః అశాంతస్య కుత స్సుఖమ్?॥ 66**

మనోనిగ్రహం లేనివాడికి ఆత్మ వివేకం కాని ఆత్మచింతన కాని అలవడవు. అలాంటివాడికి మనశ్శాంతి లేనివాడికి సుఖం శూన్యం.

**ఇంద్రియాణాం హి చరతాం య న్మనోఽనువిధీయతే।**
**తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావ మివామ్భసి॥ 67**

చుక్కాని లేని నావను సుడిగాలి దిక్కుతోచకుండా చేసినట్లు, ఇష్టానుసారం ప్రవర్తించే ఇంద్రియాలకు లొంగిపోయిన మనస్సు పురుషుడి బుద్ధిని పాడు చేస్తుంది.

**తస్మా ద్యస్య మహాబాహో! నిగృహీతాని సర్వశః**
**ఇంద్రియా ణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 68**

అర్జునా! అందువల్ల విషయసుఖాల వైపుకు వెళ్లకుండా ఇంద్రియాలను నిగ్రహించుకున్నవాడికి స్థిరమైన బుద్ధి కలుగుతుంది. వాడే స్థితప్రజ్ఞుడు.

**యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ।**
**యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః॥ 69**

ఆత్మానుభూతి లేని అన్ని ప్రాణులకూ రాత్రిగా తోచే సమయంలో మనోనిగ్రహం కలిగిన ముని మేలుకుని వుంటాడు. విషయాలపట్ల ఆసక్తితో సర్వ ప్రాణులూ మెలకువగా వున్నప్పుడు ఆత్మనిష్ఠ కలిగిన యోగికి రాత్రి అవుతుంది.

ఆపూర్యమాణ మచల ప్రతిష్ఠం సముద్ర మాపః ప్రవిశన్తి యద్వత్।
తద్వ త్కామా యం ప్రవిశన్తి సర్వేస శాన్తి మాప్నోతి న కామకామీ॥ 70

నిరంతరం నిండుతున్నప్పటికీ చలించకుండా నిలిచిన సముద్రంలో నదీ జలాలు ఎలా ప్రవేశిస్తాయో అలాగే ఎవడిలో కామాలన్నీ లీనమై అణగిపోతాయో వాడు శాంతి పొందుతాడు. భౌతిక సుఖాలకు బానిస అయినవాడికి మోక్షం లేదు.

విహాయ కామాన్ య స్సర్వాన్ పుమాన్ చరతి నిస్పృహః।
నిర్మమో నిరహంకారః స శాంతి మధిగచ్ఛతి॥ 71

కోరికలన్నిటినీ విడిచిపెట్టి ఆశ, అహంకారం, మమకారం లేకుండా మెలగే వాడు పరమశాంతిని పొందుతాడు.

ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ! నైనాం ప్రాప్య విముహ్యతి।
స్థిత్వాఽస్యా మంతకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి॥ 72

అర్జునా! ఇలా బ్రహ్మజ్ఞానం పొందినవాడి దృష్టి ప్రపంచవిషయాల మీదకు మరలా మళ్లదు. జీవితం చివరిఘట్టంలో అయినా అలాంటి జ్ఞానం కలిగితే మోక్షం లభిస్తుంది.

ఇలా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రం, శ్రీ కృష్ణార్జున సంవాదం అయిన శ్రీమద్భగవద్గీతలోని 'సాంఖ్యయోగం' అనే రెండవ అధ్యాయం సమాప్తం.

## అధ్యాయ సారాంశ శ్లోకము

కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు కదాచన।
మా కర్మ ఫలహేతు ర్భూః మాతే సంగోస్త్వ కర్మణి॥

ఓ అర్జునా! కర్మ చేయటమందే నీ కధికారమున్నది. కర్మ ఫలితాలను ఆశించి కర్మను చేయటంలో నీకు ఎప్పుడైనా అధికారము లేదు. అలాగని ఏ పని చేయకుండా ఉండటం ఉత్తమ లక్షణం కాదు. కాబట్టి ప్రతి వ్యక్తి ఫలాపేక్ష లేకుండా తన విద్యుక్తు ధర్మాన్ని నెరవేర్చాలని శ్రీకృష్ణుడు బోధించాడు.



# శ్రీమద్భగవద్గీత

## మూడవ అధ్యాయం

## కర్మయోగం

అర్జున ఉవాచ :

జ్యాయసీ చే త్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన।
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ॥ 1

అర్జునుడు : జనార్దనా! కర్మకంటే జ్ఞానమే మేలని నీ వుద్దేశమా? అలాంటప్పుడు ఘోరమైన ఈ యుద్ధకర్మకు నన్నెందుకు పురికొల్పుతున్నావు?

వ్యామిశ్రేణైవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే।
త దేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహ మాప్నుయామ్॥ 2

అటూయిటూ కాని మాటలతో నా మనసుకు మరింత కలత కలగ జేస్తున్నావు. అలా కాకుండా నాకు మేలు చేకూర్చే మార్గం ఏదో ఒకటి ఖచ్చితంగా చెప్పు.

శ్రీ భగవానువాచ :

**లోకేஉస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాஉనఘ!**
**జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం॥ 3**

శ్రీకృష్ణ భగవానుడు : అర్జునా! గతంలో నేను చెప్పిన రెండు మార్గాలూ లోకంలో వున్నాయి. అవి సాంఖ్యులకు జ్ఞానయోగం, యోగులకు నిష్కామ కర్మయోగం.

**న కర్మణా మనారంభాత్ నైష్కర్మ్యం పురుషోஉ శ్నుతే।**
**న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి॥ 4**

కర్మలు చేయనంతమాత్రాన పురుషుడు కర్మబంధాలకు దూరంగా ఉండ లేడు. కేవలం కర్మసన్న్యాసం వల్ల కూడా ఆత్మజ్ఞానం లభించదు.

**న హి కశ్చిత్ క్షణ మపి జాతు తిష్ఠత్యకర్మకృత్।**
**కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజై ర్గుణైః 5**

కర్మలు చేయకుండా ఎవడూ ఒక్క క్షణం కూడా వుండలేడు. ప్రకృతి గుణాల ప్రభావాలకు లోనై ప్రతివాళ్లు అస్వతంత్రులై కర్మలు చేస్తూనే వున్నారు.

**కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్।**
**ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచార స్స ఉచ్యతే॥ 6**

పైకి అన్ని కర్మేంద్రియాలనూ అణచిపెట్టి మనసులో మాత్రం విషయ సౌఖ్యాల గురించి ఆలోచించే అవివేకిని కపటాచారం కలవాడు అంటారు.

**య స్త్విన్ద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున।**
**కర్మేన్ద్రియైః కర్మయోగం అసక్తస్స విశిష్యతే॥ 7**

అర్జునా! మనసుతో జ్ఞానేంద్రియాలను స్వాధీనంలో వుంచుకుని, కర్మేంద్రియాల ద్వారా నిష్కామకర్మ చేస్తున్నవాడు ఉత్తముడు.

**నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః।**
**శరీరయాత్రా పి చ తే న ప్రసిద్ధ్యే దకర్మణః॥ 8**

నీ కర్తవ్యకర్మ నీవు ఆచరించవలసిందే. కర్మలు విడిచిపెట్టడం కంటే చేయడమే శ్రేయస్కరం. కర్మలు చేయకుండా నీవు జీవయాత్రకూడా సాగించలేవు.

**యజ్ఞార్థాత్ కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః**
**తదర్థం కర్మ కౌన్తేయ! ముక్తసంగ స్సమాచర॥ 9**

కుంతీపుత్రా! యాగసంబంధమైనవి తప్ప తక్కిన కర్మలన్నీ మానవులకు సంసారబంధం కలగజేస్తాయి. కనుక ఫలాపేక్ష లేకుండా దైవప్రీతి కోసం కర్మలు ఆచరించు.

**సహ యజ్ఞాః ప్రజా స్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః।**
**అనేన ప్రసవిష్యధ్వం ఏష వోఽ స్త్విష్టకామధుక్॥** 10

ప్రాచీనకాలంలో ప్రజలనూ యాగాలనూ సృష్టించి ప్రజాపతి ఇలా అన్నాడు. యజ్ఞం కోర్కెలను నెరవేర్చే కామధేనువు. దీనివల్ల మీరు పురోభివృద్ధి చెందండి.

**దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః।**
**పరస్పరం భావయన్తః శ్రేయః పర మవాప్స్యథ॥** 11

యజ్ఞయాగాదులతో మీరు దేవతలను సంతృప్తి పరచండి. పాడిపంటలు లాంటి సమృద్ధులిచ్చి వారు మీకు సంతోషం కలగజేస్తారు. పరస్పర సద్భావం పరమ శ్రేయస్సు మీకు చేకూర్చుతుంది.

**ఇష్టాన్ భోగాన్ హి వో దేవాః దాస్యంతే యజ్ఞభావితాః।**
**తైర్దత్తా న ప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః॥** 12

యజ్ఞాలతో తృప్తిపడ్డ దేవతలు మీ వాంఛితాలు నెరవేరుస్తారు. దేవతలిచ్చిన సుఖభోగాలు అనుభవిస్తూ, వారికి మళ్లీ ఆ సంపదలో కొంత కూడ అర్పించనివాడు దొంగ.

**యజ్ఞశిష్టాశిన స్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః।**
**భుంజతే తే త్వఘం పాపాః యే పచంత్యాత్మకారణాత్॥** 13

యజ్ఞాలు చేసి దేవతలకు అర్పించగా మిగిలిన పదార్థాలు భుజించే సజ్జనులు సర్వపాపాలనుంచీ విముక్తు లవుతున్నారు. అలా కాకుండా తమ కోసమే వండుకుంటున్నవాళ్లు పాపమే తింటున్నారు.

**అన్నా ద్భవంతి భూతాని పర్జన్యా దన్నసంభవః।**
**యజ్ఞా ద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః॥** 14

అన్నంవల్ల ప్రాణులన్నీ పుడుతున్నాయి. వర్షంవల్ల అన్నం లభిస్తున్నది. యజ్ఞం మూలంగా వర్షం కలుగుతున్నది. యజ్ఞం సత్కర్మల వల్ల సంభవిస్తున్నది.

**కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్।**
**తస్మా త్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్॥** 15

కర్మ వేదంనుంచి పుట్టింది. పరమాత్మవల్ల వేదం వెలసింది. అంతటా వ్యాపించిన పరమాత్మ అందువల్లనే యజ్ఞంలో ఎప్పుడూ వుంటాడు.

**ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః।**
**అఘాయు రింద్రియారామో మోఘం పార్థ! స జీవతి॥ 16**

పార్థా! ఇలా తిరుగుతున్న జగత్ చక్రాన్ని అనుసరించనివాడు పాపి, ఇంద్రియ లోలుడు, అలాంటివాడి జీవితం వ్యర్థం.

**యస్త్వాత్మరతిరేవ స్యాత్ ఆత్మతృప్తశ్చ మానవః।**
**ఆత్మ న్యేవ చ సంతుష్టః తస్య కార్యం న విద్యతే॥ 17**

ఆత్మలోనే ఆసక్తి, సంతృప్తి, సంతోషం పొందేవాడికి విద్యుక్తకర్మ లేవీ వుండవు.

**నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన।**
**న చాస్య సర్వభూతేషు కశ్చి దర్థవ్యపాశ్రయః॥ 18**

అలాంటి ఆత్మజ్ఞానికి ఈ లోకంలో కర్మలు చేయడంవల్ల కాని, మానడంవల్ల కాని ప్రయోజనం లేదు. స్వార్థదృష్టితో సృష్టిలో దేనినీ అతను ఆశ్రయించడు.

తస్మా దసక్త స్సతతం కార్యం కర్మ సమాచర।
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః॥ 19

అందువల్ల నిరంతరం నిష్కామంగా కర్మలు ఆచరించు. అలా ఫలాపేక్ష లేకుండా కర్మలు చేసేవాళ్లకు మోక్షం కలుగుతుంది.

కర్మణైవ హి సంసిద్ధిం ఆస్థితా జనకాదయః।
లోకసంగ్రహ మేవాఽపి సంపశ్యన్ కర్తు మర్హసి॥ 20

జనకుడు మొదలైనవారు నిష్కామకర్మతోనే మోక్షం పొందారు. లోకక్షేమం కోసమైనా నీవు సత్కర్మలు చేయాలి.

యద్య దాచరతి శ్రేష్ఠః తత్తదేవతరో జనః।
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే॥ 21

ఉత్తముడు చేసిన పనినే ఇతరులు కూడా అనుకరిస్తారు. అతను నెలకొల్పిన ప్రమాణాలనే లోకం అనుసరిస్తుంది.

న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన।
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి॥ 22

పార్థా! ముల్లోకాలలోనూ నేను చేయవలసిన పని ఏమీ లేదు. నాకు లేనిదికాని, కావలసిందికాని ఏమీ లేకపోయినప్పటికీ లోకవ్యవహారాలు నిత్యమూ నిర్వర్తిస్తూనే వున్నాను.

**యది హ్యహం న వర్తేయం జాతు కర్మ ణ్యతన్ద్రితః।**
**మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ! సర్వశః॥ 23**

అర్జునా! ఏ మాత్రమూ ఏమరుపాటు లేకుండా నేను నిరంతరం కర్మలు చేయకపోతే, ప్రజలంతా అలాగే ప్రవర్తిస్తారు.

**ఉత్సీదేయు రిమే లోకాః న కుర్యాం కర్మ చేదహమ్।**
**సంకరస్య చ కర్తా స్యామ్ ఉపహన్యా మిమాః ప్రజాః॥ 24**

నేను కర్మలు ఆపివేస్తే ప్రజలంతా భ్రష్టులైపోతారు. రకరకాల సంకరాలకూ, ప్రజలనాశానికి నేనే కర్తనవుతాను.

**సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత!।**
**కుర్యా ద్విద్వాం స్తథాఽఽ సక్తః చికీర్షు ర్లోకసంగ్రహమ్॥ 25**

అర్జునా! అజ్ఞానులు ఫలితాలు ఆశించి కర్మలు చేసినట్లే ఆత్మజ్ఞానులు ఫలాపేక్ష లేకుండా లోకకల్యాణం కోసం కర్తవ్యకర్మలు ఆచరించాలి.

న బుద్ధిభేదం జనయేత్ అజ్ఞానాం కర్మసంగినామ్।
జోషయేత్ సర్వకర్మాణి విద్వాన్ యుక్తస్సమాచరన్॥ 26

ఫలం కోరి కర్మలుచేసే పామరుల బుద్ధిని విజ్ఞులు వికలం చేయకూడదు. జ్ఞాని యోగిగా సమస్తకర్మలూ చక్కగా ఆచరిస్తూ ఇతరుల చేతకూడా చేయించాలి.

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః।
అహంకార విమూఢాత్మా కర్తాహ మితి మన్యతే॥ 27

ప్రకృతిగుణాలవల్ల సర్వకర్మలూ సాగుతుండగా, అజ్ఞాని అహంకారంతో, కర్మలను తానే చేస్తున్నానని తలుస్తాడు.

తత్త్వవిత్తు మహబాహో! గుణకర్మవిభాగయోః।
గుణా గుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే॥ 28

గుణాలు, కర్మల నిజస్వరూపం తెలిసిన తత్త్వవేత్త ఇంద్రియరూపాలైన గుణాలు విషయరూపాలైన గుణాలమీదే నిలిచి వున్నాయని గ్రహించి వాటి దరికి చేరడు.

ప్రకృతే ర్గుణసమ్మూఢాః సజ్జన్తే గుణకర్మసు।
తా న కృత్స్నవిదో మన్దాన్ కృత్స్నవిన్న విచాలయేత్॥ 29

ప్రకృతి గుణాలతో ముగ్ధులైన మూఢులు గుణకర్మలలోనే ఆసక్తి చూపుతారు. అయితే అల్పులూ, మందబుద్ధులూ అయినవాళ్ల మనస్సులను జ్ఞానులు చలింప చేయకూడదు.

**మయి సర్వాణి కర్మాణి సన్న్య స్యాధ్యాత్మ చేతసా।**
**నిరాశీ ర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః॥ 30**

నీవు చేసే సమస్త కర్మలూ నాకు సమర్పించి, వివేకంతో ఆశా మమకారాలు విడిచిపెట్టి నిశ్చింతగా యుద్ధం చెయ్యి.

**యే మే మత మిదం నిత్యం అనుతిష్ఠంతి మానవాః।**
**శ్రద్ధావన్తోఽ నసూయన్తో ముచ్యంతే తేఽ పి కర్మభిః॥ 31**

అసూయలేకుండా శ్రద్ధాభక్తులతో నిరంతరం నా ఈ అభిప్రాయం ప్రకారం ప్రవర్తించే మానవులు కర్మబంధాలనుంచి విముక్తులవుతారు.

**యే త్వేత దభ్యసూయన్తో నానుతిష్ఠంతి మే మతమ్।**
**సర్వజ్ఞాన విమూఢాం స్తాన్ విద్ధి నష్టా నచేతసః॥ 32**

నేను ఉపదేశించిన ఈ నిష్కామకర్మయోగ విధానాన్ని నిందించి ఆచరించని వాళ్లు అవివేకులూ, అజ్ఞానులూ, అన్నివిధాల చెడిపోయినవాళ్లూ అని తెలుసుకో.

సదృశం చేష్టతే స్వస్యాః, ప్రకృతేః జ్ఞానవా నపి।
ప్రకృతిం యాన్తి భూతాని, నిగ్రహః కిం కరిష్యతి?॥ 33

పండితుడు కూడా తన సహజ స్వభావం ప్రకారమే ప్రవర్తిస్తాడు. ప్రాణులన్నీ తమతమ ప్రకృతినే అనుసరిస్తాయి. అలాంటప్పుడు నిగ్రహం ఏం చేస్తుంది?

ఇంద్రియ స్యేంద్రియ స్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ।
తయో ర్న వశ మాగచ్ఛేత్ తౌ హ్యస్య పరిపంథినౌ॥ 34

ఇంద్రియాలన్నిటికి తమతమ విషయాలపట్ల అనురాగం, ద్వేషం వున్నాయి. ఎవళ్ళూ వాటికి వశులు కాకూడదు. అవి మానవులకు బద్ధశత్రువులు.

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః॥ 35

ఇతరుల ధర్మం చక్కగా ఆచరించడంకంటే లోటుపాటులతో అయినా తన ధర్మం పాటించడమే మేలు. పరధర్మం భయభరితం కావడంవల్ల స్వధర్మాచరణలో మరణమైనా మంచిదే.

అర్జున ఉవాచ :

అథ కేనఽ ప్రయుక్తోయం పాపం చరతి పూరుషః।
అనిచ్ఛ న్నపి వార్ష్ణేయ బలా దివ నియోజితః॥ 36

అర్జునుడు : కృష్ణా! తనకు ఇష్టం లేకపోయినా మానవుడు దేని బలవంతం వల్ల పాపాలు చేస్తున్నాడు?

శ్రీభగవానువాచ :

కామ ఏషః క్రోధ ఏషః రజోగుణ సముద్భవః।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్॥ 37

శ్రీకృష్ణ భగవానుడు : రజోగుణంవల్ల కలిగిన కామక్రోధాలు అన్ని పాపాలకూ మూలకారణాలు. ఎంత అనుభవించినా తనివితీరని కామమూ, మహాపాతకాలకు దారితీసే క్రోధమూ ఈ లోకంలో మానవుడికి మహాశత్రువులు.

ధూమేనావ్రియతే వహ్నిః య థాఽ దర్శో మలేన చ।
యథోల్బేనావృతో గర్భః తథా తేనేద మావృతమ్॥ 38

పొగ అగ్నినీ, మురికి అద్దాన్నీ, మావి గర్భంలోని శిశువునూ కప్పివేసినట్లు కామం ఆత్మజ్ఞానాన్ని ఆవరించింది.

**ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా।**
**కామరూపేణ కౌంతేయ! దుష్పూరేణానలేన చ॥** 39

అర్జునా! ఎంతకీ తృప్తి ఎరుగని అగ్నిలాంటి కామం జ్ఞానులకు నిత్య శత్రువు. ఆత్మజ్ఞానాన్ని అలాంటి కామం కప్పివేసింది.

**ఇంద్రియాణి మనో బుద్ధిః అస్యాధిష్ఠానముచ్యతే।**
**ఏతై ర్విమోహయ త్యేష జ్ఞాన మావృత్య దేహినామ్॥** 40

ఈ కామానికి ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి ఆశ్రయాలని చెబుతారు. ఇది వీటిద్వారా జ్ఞానాన్ని ఆవరించి దేహధారులకు మోహం కలుగజేస్తున్నది.

**తస్మాత్త్వ మింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ!।**
**పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాన నాశనమ్॥** 41

అర్జునా! అందువల్ల మొట్టమొదట ఇంద్రియాలను నీ చెప్పుచేతల్లో వుంచుకొని, జ్ఞానవిజ్ఞానాలను నాశనంచేసే కామమనే పాపిని పారద్రోలు.

ఇంద్రియాణి పరాణ్యాహుః ఇంద్రియేభ్యః పరం మనః
మనసస్తు పరా బుద్ధిః యో బుద్ధేః పరతస్తు సః॥ 42

దేహం కంటే ఇంద్రియాలు గొప్పవి. మనస్సు ఇంద్రియాలకంటే శ్రేష్ఠం. బుద్ధి మనస్సుకంటే అధికం. అయితే బుద్ధిని అధిగమించింది ఆత్మ.

ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మానా।
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్॥ 43

అర్జునా! ఇలా బుద్ధికంటే ఆత్మ గొప్పదని గుర్తించి, బుద్ధితోనే మనస్సును నిలకడ చేసుకుని, కామరూపంలో వున్న జయించరాని శత్రువును రూపుమాపు.

**ఇలా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రం, శ్రీ కృష్ణార్జున సంవాదం అయిన శ్రీమద్భగవద్గీతలోని 'కర్మయోగం' అనే మూడవ అధ్యాయం సమాప్తం.**



## అధ్యాయ సారాంశ శ్లోకము

**కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకాదయః।**
**లోక సంగ్రహ మేవాపి సంపశ్యన్ కర్తు మర్హసి॥**

ఓ అర్జునా! పూర్వము జనకుడు మొదలైన మహారాజులందరూ ఫలాన్ని ఆశించకుండా పుణ్యకర్మల నాచరించి మోక్షాన్ని పొందారు. కాబట్టి లోకం కోసమైన నీవు నీకు చెప్పిన కర్మను చేయవలసి యున్నది. పేరు ప్రతిష్ఠలు కలిగిన ఉత్తముడు ఏ పనిచేస్తే లోకప్రజలు ఆ పనినే ఆదర్శంగా తీసుకొని చేస్తారు. అందువల్ల శ్రేష్ఠుడు. ప్రజలకోసం మంచి పనులనే చేయాలని కృష్ణ భగవానుడు ఉపదేశించాడు.



# **శ్రీమద్భగవద్గీత**

## నాల్గవ అధ్యాయం

## జ్ఞానయోగం

*శ్రీభగవానువాచ :*

**ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహ మవ్యయమ్॥**
**వివస్వాన్ మనవే ప్రాహ మనురిక్ష్వాకఽవేఽబ్రవీత్॥ 1**

శ్రీకృష్ణ భగవానుడు : వినాశంలేని ఈ యోగం నేను పూర్వం సూర్యుడికి ఉపదేశించాను. సూర్యుడు మనువుకూ, మనువు ఇక్ష్వాకుడికీ బోధించారు.

**ఏవం పరమ్పరాప్రాప్తం ఇమం రాజర్షయో విదుః।**
**స కాలేనేహ మహతా యోగో నష్టం పరన్తప॥ 2**

**అర్జునా! ఇలా సంప్రదాయ పరంపరగా ఇచ్చిన కర్మయోగాన్ని రాజర్షులు తెలుసుకున్నారు. అయితే అది ఈ లోకంలో క్రమేపి కాలగర్భంలో కలసిపోతుంది.**

**న ఏవాయం మయా తేద్య యోగః ప్రోక్తః పురాతనః।**
**భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్॥ 3**

నాకు భక్తుడవూ, స్నేహితుడవూ కావడంవల్ల పురాతనమైన ఈ యోగాన్ని నీకిప్పుడు మళ్లీ వివరించాను. ఇది ఉత్తమం, రహస్యమూ అయిన జ్ఞానం సుమా!

అర్జున ఉవాచ :

**అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః!।**
**కథమేత ద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవానితి॥ 4**

అర్జునుడు : సూర్యుడి జన్మచూస్తే ఏనాటిదో, మరి నీవు ఇప్పటివాడవు. అలాంటప్పుడు నీవు సూర్యుడికి ఎలా ఉపదేశించావో ఊహించలేకపోతున్నాను.

శ్రీభగవానువాచ :

**బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున!।**
**తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరన్తప!॥ 5**

శ్రీభగవానుడు : అర్జునా! నాకూ నీకూ ఎన్నో జన్మలు గడిచాయి. వాటన్నిటినీ నేను ఎరుగుదును. నీవు మాత్రం ఎరగవు.

**అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్।**
**ప్రకృతిం స్వామధిష్ఠాయ సమ్భవామ్యాత్మమాయయా॥ 6**

జననమరణాలు లేని నేను సర్వప్రాణులకూ ప్రభువునైనప్పటికీ నా పరమేశ్వర స్వభావం విడిచిపెట్టకుండానే నేను మాయాశక్తివల్ల జన్మిస్తున్నాను.

**యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత॥**
**అభ్యుత్థాన మధర్మస్య తదాஉஉత్మానం సృజామ్యహమ్॥** 7

ఈ లోకంలో ధర్మ అధోగతిపాలై అధర్మం ప్రబలినప్పుడల్లా నేను ఉద్భవిస్తుంటాను.

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్।**
**ధర్మ సంస్థాపనార్థాయ సమ్భవామి యుగే యుగే॥** 8

సజ్జన సంరక్షణకూ, దుర్జన సంహారానికి, ధర్మసంస్థాపనకూ నేను అన్ని యుగాలలోనూ అవతరిస్తుంటాను.

**జన్మ కర్మ చ మే దివ్యం ఏవం యో వేత్తి తత్త్వతః।**
**త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మా మేతి సో ర్జున॥** 9

అర్జునా! అలౌకికమైన నా అవతార రహస్యం యథార్థంగా ఎరిగిన వాడు ఈ శరీరం విడిచిపెట్టాక మళ్లీ జన్మించడు. నన్నే చేరుతాడు.

**వీత రాగ భయ క్రోధాః మన్మయా మాముపాశ్రితాః।**
**బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః॥ 10**

అనురాగం, భయం, కోపం విడిచిపెట్టి, నన్నే ఆశ్రయించి నా మీదే మనస్సు లగ్నం చేసినవాళ్లు ఎంతోమంది తత్త్వజ్ఞానమనే తపస్సువల్ల పవిత్రులై నన్ను పొందారు.

**యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజా మ్యహమ్।**
**మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ! సర్వశః॥ 11**

అర్జునా! ఎవరు ఎలాగ నన్ను ఆరాధిస్తారో వాళ్లని అలాగే నేను అనుగ్రహిస్తాను. అందువల్ల నా మార్గమే మానవులు అన్నివిధాల అనుసరిస్తారు.

**కాంక్షన్తః కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః।**
**క్షిప్రం హి మానుషే లోకే సిద్ధి ర్భవతి కర్మజా॥ 12**

ఈ లోకంలో కర్మలకు ఫలం శీఘ్రంగా సిద్ధిస్తుంది. కనుకనే కర్మఫలం ఆశించి మానవులు దేవతలను ఆరాధిస్తారు.

**చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణ కర్మ విభాగశః।**
**తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్॥ 13**

వారి వారి గుణాలకు, కర్మలకు తగ్గట్లుగా నాలుగు వర్ణాలు నేనే సృష్టించాను. అయినప్పటికీ వాటికి కర్తనైన నన్ను కర్తను కాదనీ, శాశ్వతుడననీ తెలుసుకో.

**న మాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మఫలే స్పృహా।**
**ఇతి మాం యోభిజానాతి కర్మభిర్న స బధ్యతే॥** 14

నన్ను కర్మలంటవనీ, నాకు కర్మఫలాపేక్ష లేదనీ గ్రహించిన వాడిని కర్మలు బంధించవు.

**ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వై రపి ముముక్షుభిః।**
**కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్॥** 15

మోక్షంపట్ల ఆసక్తి కలిగిన పూర్వులు కూడా ఈ విషయం గుర్తించే కర్మలు చేశారు. కనుక పురాతనకాలంనుంచీ వస్తున్న కర్మవిధానం నీవూ అనుసరించు.

**కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః।**
**తత్తే కర్మ ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వా మోక్ష్యసేఽ శుభాత్॥** 16

పండితులు కూడా కర్మఏదో, కర్మకానిది ఏదోతెలియక తికమకలవుతున్నారు. సంసారబంధాలనుంచి విముక్తి పొందడానికి అవసరమైన కర్మస్వరూపం వివరిస్తాను విను.

కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చవికర్మణః
అకర్మణ శ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః॥ 17

కర్మ అంటే ఏమిటో, శాస్త్రాలు నిషేధించిన వికర్మ అంటే ఏమిటో, ఏపనీ చేయకపోవడమనే అకర్మ అంటే ఏమిటో తెలుసుకోవడం అవసరం. కర్మతత్త్వాన్ని గ్రహించడం కష్టసాధ్యం.

కర్మ ణ్యకర్మ యః పశ్యేత్ అకర్మణి చ కర్మ యః।
స బుద్ధిమా న్మను ష్యేషు సంయుక్తః కృత్స్నకర్మకృత్॥ 18

కర్మలో అకర్మ, అకర్మలో కర్మచూసేవాడు మానవులలో బుద్ధిమంతుడు, యోగి, సమస్తకర్మలూ ఆచరించేవాడు.

యస్య సర్వే సమారమ్భాః కామ సఙ్కల్ప వర్జితాః।
జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం తమాహుః పండితం బుధాః॥ 19

ఫలాసక్తి లేకుండా అన్ని కర్మలూ ఆచరించడంతోపాటు జ్ఞానమనే అగ్నితో పూర్వపు వాసనల్ని నాశనం చేసుకున్నవాడిని పండితుడని పెద్దలు చెబుతారు.

త్యక్త్వా కర్మఫలాసఙ్గం నిత్యతృప్తో నిరాశ్రయః।
కర్మ ణ్యభిప్రవృత్తోఽపి నైవ కిఞ్చి త్కరోతి సః॥ 20

కర్మఫలాపేక్ష విడిచిపెట్టి నిత్యమూ సంతృప్తితో దేనిమీదా ఆధార పడకుండా, కర్మలు చేసేవాడు, ఏమీ చేయనివాడే అవుతాడు.

**నిరాశీ ర్యతచిత్తాత్మా త్యక్త సర్వపరిగ్రహః।**
**శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్॥ 21**

వాంఛలు వదలిపెట్టి చిత్తమూ, మనస్సూ వశపరచుకుని, ఈ వస్తువు నాది అనేది లేకుండా కేవలం శరీరపోషణకోసం కర్మలు ఆచరించేవాడు పాపం పొందడు.

**యదృచ్ఛా లాభ సన్తుష్టో ద్వన్ద్వాతీతో విమత్సరః।**
**సమ స్సిద్ధావసిద్ధౌ చ కృత్వాఽపి న నిబధ్యతే॥ 22**

అప్రయత్నంగా లభించిన వస్తువులతో సంతృప్తి చెందుతూ, ఇతరుల మీద ఈర్ష్యపడకుండా, సుఖదుఃఖాలకు లొంగకుండా జయాపజయాలపట్ల సమదృష్టి కలిగినవాడు కర్మలు చేసినా బంధాలలో చిక్కుకోడు.

**గతసఙ్గస్య ముక్తస్య జ్ఞానావస్థిత చేతసః।**
**యజ్ఞా యాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే॥ 23**

దేనిమీదా ఆసక్తి లేకుండా, విముక్తి పొంది, మనస్సును ఆత్మజ్ఞానం మీదే నిలిపినవాడు భగవంతుడి ప్రీతికోసం కాని, లోకకల్యాణార్థం కాని చేసే కర్మలన్నీ పూర్తిగా నశించిపోతాయి.

బ్రహ్మార్పణం బ్రహ్మహవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్।
బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మ సమాధినా॥ 24

యజ్ఞంలోని హోమసాధనాలు, హోమద్రవ్యాలు, హోమాగ్ని, హోమం చేసే వాడు, హోమం చేయబడిందీ, హోమకర్మ - పరబ్రహ్మ స్వరూపాలే అని భావించి యజ్ఞకర్మలు ఆచరించేవాడు పరబ్రహ్మనే పొందుతాడు.

దైవ మే వాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే।
బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం యజ్ఞే నైవోపజుహ్వతి॥ 25

దేవతలను ఉద్దేశించి కొంతమంది యోగులు యజ్ఞం చేస్తారు. మరి కొంతమంది బ్రహ్మమనే అగ్నిలో ఆత్మచేత తమ ఆత్మనే ఆహుతి చేస్తున్నారు.

శ్రోత్రాదీ నీన్ద్రియా ణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి।
శబ్దాదీన్ విషయా నన్యే ఇన్ద్రియాగ్నిషు జుహ్వతి॥ 26

కొంతమంది చెవిలాంటి ఇంద్రియాలను నిగ్రహం అనే అగ్నిలోనూ, మరికొంత మంది శబ్దాది విషయాలను ఇంద్రియాలనే అగ్నిలోనూ హోమం చేస్తున్నారు.

**సర్వాణీన్ద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే।**
**ఆత్మ సంయమ యోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే॥ 27**

కొందరు ఇంద్రియాలన్నిటి వ్యాపారాలూ, ప్రాణవ్యాపారాలూ జ్ఞానంతో ప్రకాశించే మనోనిగ్రహమనే అగ్నికి అర్పిస్తున్నారు.

**ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాఽపరే।**
**స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ యతయ స్సంశ్రిత వ్రతాః॥ 28**

దానధర్మాలే యజ్ఞంగా కొంతమంది, తపస్సే యజ్ఞంగా కొంతమంది, యోగసాధనే యజ్ఞంగా కొంతమంది ఆచరిస్తున్నారు. కార్యదీక్ష, కఠోరవ్రతం కలిగిన మరికొంతమంది వేదాధ్యయనమే యజ్ఞమని భావించి స్వాధ్యాయ యజ్ఞమూ, జ్ఞానయజ్ఞమూ చేస్తున్నారు.

**అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాఽ పరే।**
**ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః॥ 29**

అలాగే ప్రాణాయామపరులు కొంతమంది ప్రాణవాయువు, అపాన వాయువుల గతులను నిరోధించి అపానంలో ప్రాణమూ, ప్రాణంలో అపానమూ హోమం చేస్తున్నారు.

**అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి।**
**సర్వేఽ ప్యేతే యజ్ఞవిదో యజ్ఞః క్షపిత కల్మషాః॥ 30**

మరికొంతమంది ఆహార నియమంతో ప్రాణవాయువులను ప్రాణాలలోనే అర్పిస్తారు. యజ్ఞాలు తెలిసిన వీళ్లంతా యజ్ఞాలవల్ల పాపపంకిలాన్ని క్షాళనం చేసుకుంటున్నారు.

**యజ్ఞశిష్టామృతభుజో యాన్తి బ్రహ్మ సనాతనమ్।**
**నాయం లోకోఽ స్త్యయజ్ఞస్య కుతోఽ న్యః కురుసత్తమ॥ 31**

కురుకులభూషణా! యజ్ఞాలలో మిగిలిన అన్నమనే అమృతాన్ని భుజించేవారు శాశ్వత పరబ్రహ్మం పొందుతారు. యజ్ఞం ఒకటీ చేయనివాడికి ఇహలోక సుఖం లేదు, పరలోక సుఖం అసలే లేదు.

**ఏవం బహువిధా యజ్ఞాః వితతాః బ్రహ్మణో ముఖే।**
**కర్మజాన్విద్ధి తాన్సర్వాన్ ఏవం జ్ఞాత్వావిమోక్ష్యసే॥ 32**

ఈవిధంగా వివిధ యజ్ఞాలూ వేదంలో విశదీకరించబడ్డాయి. అవన్నీ కర్మల నుంచి ఏర్పడ్డాయని తెలుసుకుంటే నీవు సంసారబంధంనుంచి విముక్తి పొందుతావు.

**శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరన్తప!**
**సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే॥ 33**

అర్జునా! ద్రవ్యంవల్ల సాధించబడే యజ్ఞంకంటే జ్ఞానయజ్ఞం శ్రేష్ఠం. సమస్త కర్మలూ జ్ఞానంలోనే పరిసమాప్తం కావడం దీనికి కారణం.

**తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా।**
**ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః॥ 34**

తత్త్వవేత్తలైన జ్ఞానులు అలాంటి జ్ఞానం నీకు ఉపదేశిస్తారు. వారి వద్దకు వెళ్లినప్పుడు వినయవిధేయతలతో నమస్కరించి, సమయం సందర్భం చూసి ప్రశ్నించి, సేవలు చేసి తెలుసుకో.

**యత్ జ్ఞాత్వా న పునర్మోహం ఏవం యాస్యసి పాణ్డవ।**
**యేన భూతాన్యశేషేణ ద్రక్ష్య స్యాత్మ న్యథోమయి॥ 35**

ఆ జ్ఞానం తెలుసుకుంటే నీవు మళ్లీ ఇలాంటి మోహం పొందవు. సమస్త ప్రాణులనూ నీలోనూ, నాలోనూ కూడా చూడగలవు.

**అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః।**
**సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సన్తరిష్యసి॥ 36**

పాపాత్ములందరిలో మహాపాపివైనాసరే, జ్ఞానమనే తెప్పతోనే పాప సాగరాన్ని దాటివేస్తావు.

**యథైధాంసి సమిద్ధోఽగ్నిః భస్మసాత్కురుతేఽర్జున।**
**జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్ కురుతే తథా॥ 37**

అర్జునా! బాగా మండుతున్న అగ్ని కట్టెలను ఎలా భస్మం చేస్తుందో అలాగే జ్ఞానమనే అగ్ని సర్వకర్మలనూ భస్మం చేస్తుంది.

**న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే।**
**తత్స్వయం యోగసంసిద్ధః కాలే నాత్మని విన్దతి॥ 38**

ఈ ప్రపంచంలో జ్ఞానంతో సరితూగే పవిత్రమైన వస్తువు మరొకటిలేదు.కర్మ యోగసిద్ధి పొందినవాడికి కాలక్రమేణా అలాంటి జ్ఞానం ఆత్మలోనే కలుగుతుంది.

**శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పర స్సంయతేన్ద్రియః।**
**జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తిం అచిరేణాధిగచ్ఛతి॥ 39**

శ్రద్ధానక్తులూ, ఇంద్రియ నిగ్రహమూ కలిగినవాడు బ్రహ్మజ్ఞానం పొందుతాడు. జ్ఞానం కలిగిన వెంటనే పరమశాంతి లభిస్తుంది.

**అజ్ఞశ్చాశ్రద్ధధానశ్చ సంశయాత్మా వినశ్యతి।**
**నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః॥ 40**

అజ్ఞానం, అశ్రద్ధత, అనుమానం మనిషిని పాడు చేస్తాయి. అడుగడుగునా సందేహించే వాడికి ఇహలోకంలో కూడా సుఖశాంతు లుండవు.

**యోగసన్న్యస్త కర్మాణం జ్ఞానసంఛిన్న సంశయమ్।**
**ఆత్మవన్తం న కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ!॥ 41**

అర్జునా! నిష్కామ కర్మయోగంవల్ల కర్మఫలాలు విడిచిపెట్టి, జ్ఞానంతో సంశయాలు పోగొట్టుకున్న ఆత్మజ్ఞానిని కర్మలు బంధించలేవు.

**తస్మా దజ్ఞానసమ్భూతం హృత్స్థం జ్ఞానాసినాఽఽత్మనః।**
**ఛిత్త్వై నం సంశయం యోగం ఆతిష్ఠోత్తిష్ఠ భారత!॥ 42**

అర్జునా! అందువల్ల అజ్ఞానం మూలంగా నీ హృదయంలో కలిగిన ఈ సందేహాన్ని జ్ఞానమనే కత్తితో నరికివేసి, నిష్కామ కర్మయోగం ఆచరించు. లేచి యుద్ధం చెయ్యి.

**ఇలా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రం, శ్రీకృష్ణార్జున సంవాదం అయిన శ్రీమద్భగవద్గీతలోని 'జ్ఞానయోగం' అనే నాల్గవ అధ్యాయం సమాప్తం.**

## అధ్యాయ సారాంశ శ్లోకము

**బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతం।**
**బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మ కర్మ సమాధినా॥**

ఓ అర్జునా! ఎవడైతే హోమాగ్నిని, హోమద్రవ్యాలను, హోమమును - హోమము చేయువాడిని బ్రహ్మముగానే భావించి యజ్ఞాన్ని చేస్తాడో అట్టివాడు బ్రహ్మనే పొందుతున్నాడు. కనుక ఈ సమస్త జగత్తును బ్రహ్మ స్వరూపముగానే భావించాలి.

# శ్రీ మద్భగవద్గీత

## ఐదవ అధ్యాయం

## కర్మసన్న్యాసయోగం

*అర్జున ఉవాచ :*

**సన్న్యాసం కర్మణాం కృష్ణ! పునర్యోగం చ శంససి।**
**యచ్ఛ్రేయ ఏతయో రేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్॥ 1**

అర్జునుడు : కృష్ణా! ఒకసారి కర్మ సన్యాసం చేయమనీ, మరోసారి కర్మయోగం ఆచరించమనీ ఉపదేశిస్తున్నావు. ఈ రెండింటిలో ఏది మంచిదో నాకు తేల్చి చెప్పు.

*శ్రీభగవానువాచ :*

**సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరావుభౌ।**
**తయోస్తు కర్మసన్న్యాసాత్ కర్మయోగో విశిష్యతే॥ 2**

శ్రీభగవానుడు : కర్మత్యాగమూ, కర్మయోగమూ కూడా మోక్షం కలగజేస్తాయి. అయితే ఈ రెండింటిలో నిష్కామకర్మయోగం మేలు.

జ్ఞేయ స్స నిత్య సన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి।
నిర్ద్వంద్వో హి మహాబాహో! సుఖం బన్ధా త్ప్రముచ్యతే॥ 3

అర్జునా! దేనిమీదా ద్వేషం, కోరిక లేనివాడు నిత్య సన్న్యాసి. సుఖదుఃఖాది ద్వంద్వాలు లేకుండా అలాంటివాడు సులభంగా భవబంధాల నుంచి విముక్తి పొందుతున్నాడు.

సాంఖ్యయోగౌ పృథ గ్బాలాః ప్రవదంతి న పండితాః।
ఏకమప్యాస్థితః సమ్యక్ ఉభయోర్విన్దతే ఫలమ్॥ 4

జ్ఞానం వేరూ, కర్మయోగం వేరూ అని అవివేకులే తప్ప వివేకులు చెప్పరు. ఈ రెండింటిలో చక్కగా ఏ ఒక్కదాన్ని ఆచరించినా మోక్షఫలం దక్కుతుంది.

యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగై రపి గమ్యతే।
ఏకం సాఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి॥ 5

జ్ఞానయోగులు పొందే ఫలమే కర్మ యోగులూ పొందుతారు. జ్ఞానయోగం, కర్మయోగం ఒకటే అని గ్రహించినవాడే నిజమైన జ్ఞాని.

సన్న్యాసస్తు మహాబాహో దుఃఖ మాప్తు మయోగతః
యోగయుక్తో ముని ర్బ్రహ్మ న చిరే ణాధిగచ్ఛతి॥ 6

అర్జునా! కర్మయోగం అవలంబించకుండా సన్యాసం పొందడం సాధ్యపడేది కాదు. నిష్కామకర్మ చేసే ముని అచిరకాలంలో బ్రహ్మసాక్షాత్కారం పొందుతాడు.

**యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేన్ద్రియః।**
**సర్వ భూతాత్మ భూతాత్మ కుర్వ న్నపి న లిప్యతే॥ 7**

నిష్కామకర్మాచరణం, నిర్మలహృదయం, మనోజయం, ఇంద్రియనిగ్రహం కలిగి, సమస్త జీవులలో వుండే ఆత్మ, తన ఆత్మ ఒకటే అని తెలుసుకున్నవాడు కర్మలు చేసినా ఎలాంటి దోషమూ అంటదు.

**నైవ కిఞ్చిత్కరో మీతి యుక్తో మన్యేత తత్త్వవిత్।**
**పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ అశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్॥ 8**

**ప్రలపన్ విసృజన్ గృహ్ణన్ ఉన్మిషన్ నిమిషన్నపి।**
**ఇన్ద్రియాణీన్ద్రియార్థే షు వర్తన్త ఇతి ధారయన్॥ 9**

పరమార్థతత్వం తెలిసిన కర్మయోగి తానేమీ చేయడం లేదనే తలుస్తాడు. చూడడంలో, వినడంలో, తాకడంలో, వాసన చూడడంలో, తినడంలో, నడవడంలో, నిద్రపోవడంలో, ఊపిరి పీల్చడంలో, మాట్లాడడంలో, గ్రహించడంలో,

కళ్లు తెరవడంలో, మూయడంలో ఆయా ఇంద్రియాలే వాటి వాటి విషయాలలో ప్రవర్తిస్తున్నాయని అతను తెలుసుకోవడమే దీనికి కారణం.

బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః।
లిప్యతే న స పాపేన పద్మపత్రమివామ్భసా॥ 10

నీరు తామరాకును అంటదు. అలాగే పరమేశ్వరార్పణ బుద్ధితో ఫలాపేక్ష లేకుండా కర్మలు చేసేవాడిని పాపాలు అంటవు.

కాయేన మనసా బుద్ధ్యా కేవలై రిన్ద్రియై రపి।
యోగినః కర్మ కుర్వన్తి సఙ్గం త్యక్త్వా త్మశుద్ధయే॥ 11

కర్మయోగులు ఆసక్తి, అభిమానం విడిచిపెట్టి తమ శరీరంతో, మనస్సుతో, బుద్ధితో, వట్టి ఇంద్రియాలతో కర్మలు చిత్తశుద్ధి కోసమే చేస్తుంటారు.

యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తి మాప్నోతి నైష్ఠికీమ్।
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే॥ 12

నిష్కామకర్మయోగి కర్మఫలాన్ని విడిచిపెట్టి ఆత్మజ్ఞానంవల్ల కలిగే శాశ్వతమైన శాంతి పొందుతాడు. అలా కాకుండా ఫలాపేక్షతో కర్మలు చేసేవాడు కర్మబంధంలో చిక్కుకుంటాడు.

సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ।
నవద్వారే పురే దేహీ నైవ కుర్వ న్న కారయన్॥ 13

ఇంద్రియ నిగ్రహం కలిగినవాడు మనస్సుతో కర్మలన్నిటినీ వదలిపెట్టి తాను ఏమీ చేయకుండియు ఇతరులచేత చేయించకుండా, తొమ్మిది ద్వారాలుండే శరీరమనే పట్టణంలో హాయిగా వుంటాడు.

న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః।
న కర్మఫల సంయోగం స్వభావస్తు ప్రవర్తతే॥ 14

పరమేశ్వరుడు జీవులకు కర్తృత్వంకాని, కర్మలుకాని, కర్మఫలాపేక్ష కాని కలగజేయడం లేదు. ప్రకృతులూ, ప్రారబ్ధాలూ కర్తృత్వాదులకు కారణాలు.

**నాదత్తే కస్యచి త్పాపం న చైవ సుకృతం విభుః।**
**అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః॥** 15

భగవంతుడికి ఎవరి పాపపుణ్యాలతోనూ ప్రమేయం లేదు. జ్ఞానాన్ని అజ్ఞానం ఆవరించడంవల్ల జీవులకు అలాంటి భ్రమ కలుగుతున్నది.

**జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః।**
**తేషామాదిత్యవద్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్॥** 16

ఆత్మజ్ఞానంతో అజ్ఞానాన్ని రూపుమాపుకున్నవాళ్లు సూర్యుడికాంతి లాంటి తమ జ్ఞానంతో పరబ్రహ్మ స్వరూపాన్ని సాక్షాత్కరింప చేసుకుంటారు.

**తద్బుద్ధయ స్తదాత్మానః తన్నిష్ఠా స్తత్పరాయణాః।**
**గచ్ఛన్త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూత కల్మషాః॥ 17**

ఆ పరమాత్మమీదే బుద్ధినీ, మనస్సునూ నిలిపినవాళ్లూ, ఆ పరాత్పరుని మీదే నిష్ఠ, ఆసక్తి కలిగినవాళ్లూ జ్ఞానంతో పాపాలను పోగొట్టుకొని పునర్జన్మలేని మోక్షం పొందుతారు.

**విద్యా వినయ సమ్పన్నే బ్రాహ్మణే గవి హస్తిని।**
**శుని చైవ శ్వపాకే చ పణ్డితా స్సమదర్శినః॥ 18**

'విద్యా వినయాలు కలిగిన బ్రాహ్మణుడిని, గోవును, ఏనుగును, కుక్కను, చండాలుడిని ఆత్మజ్ఞానులు సమదృష్టితో చూస్తారు.

**ఇహైవ తైర్జిత స్సర్గో యేషాం సామ్యే స్థితం మనః।**
**నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మా ద్బ్రహ్మణి తే స్థితాః॥ 19**

సర్వభూతాలనూ నిశ్చలమనస్సుతో, సమభావంతో సందర్శించినవాళ్లూ సంసారబంధాన్ని ఈ జన్మలోనే జయిస్తారు. పరబ్రహ్మం దోషం లేకుండా సర్వత్రా సమంగా ఉంటుంది కనుక అలాంటి సమదృష్టి కలిగిన వాళ్లు ముక్తి పొందుతారు.

**న ప్రహృష్యే త్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్య చాప్రియమ్।**
**స్థిర బుద్ధిరసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః॥ 20**

మోహం లేకుండా నిశ్చలమైన బుద్ధివున్న బ్రహ్మవేత్త ఇష్టమైనది సంప్రాప్తించినప్పుడు సంతోషించడు, ఇష్టంలేనిది సంభవించినప్పుడు విచారించడు. బ్రహ్మంలోనే నిరంతరం లీనమై వుంటాడు.

**బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విన్దత్యాత్మని యత్సుఖమ్।**
**స బ్రహ్మయోగ యుక్తాత్మా సుఖమక్షయ మశ్నుతే॥ 21**

ప్రపంచ సుఖాలమీద ఆసక్తి లేనివాడు ఆత్మానందం అనుభవిస్తాడు. అలాంటి బ్రహ్మనిష్ఠ కలిగినవాడు శాశ్వతమైన ఆనందం పొందుతాడు.

**యే హి సంస్పర్శజాః భోగాః దుఃఖయోనయ ఏవ తే।**
**ఆద్యన్తవన్తః కౌన్తేయ! న తేషు రమతే బుధః॥ 22**

కౌంతేయ! ఇంద్రియలోలత్వం అనుభవించే బాహ్యసుఖాలు దుఃఖహేతువులు, క్షణికాలు. అందువల్ల నిర్మలబుద్ధి కలవాడు వాటిని ఆశించడు.

**శక్నో తీహైవ య స్సోఢుం ప్రాక్శరీర విమోక్షణాత్।**
**కామక్రోధోద్భవం వేగం స యుక్త స్స సుఖీ నరః॥ 23**

కామక్రోధాలవల్ల కలిగే ఉద్రేకాన్ని జీవితకాలంలో అణగద్రొక్కిన వాడే యోగి, సుఖవంతుడు.

**యోన్తస్సుఖోన్తరారామః తథాన్తర్జ్యోతి రేవ యః।**
**స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోధిగచ్ఛతి॥ 24**

ఆత్మలోనే ఆనందిస్తూ, ఆత్మలోనే క్రీడిస్తూ, ఆత్మలోనే ప్రకాశిస్తూ వుండే యోగి బ్రహ్మస్వరూపుడై బ్రహ్మానందం పొందుతాడు.

**లభన్తే బ్రహ్మనిర్వాణం ఋషయః క్షీణకల్మషాః।**
**ఛిన్నద్వైధాః యతాత్మానః సర్వభూతహితే రతాః॥ 25**

సంశయాలను తొలగించుకొని, మనోనిగ్రహంతో సకల ప్రాణులకూ మేలు చేయడంలో ఆసక్తి కలిగిన ఋషులు పాపాలన్నిటినీ పోగొట్టుకుని బ్రహ్మ సాక్షాత్కారం పొందుతారు.

**కామక్రోధ వియుక్తానాం యతీనాం యతచేతసామ్।**
**అభితోబ్రహ్మ నిర్వాణం వర్తతే విజితాత్మనామ్॥** 26

కామక్రోధాలను విడిచిపెట్టి, మనస్సును జయించిన, ఆత్మజ్ఞాన సంపన్నులైన సన్న్యాసులకు సర్వత్రా మోక్షం కలుగుతుంది.

**స్పర్శాన్ కృత్వా బహి ర్బాహ్యాన్ చక్షుశ్చైవాన్తరే భ్రువోః।**
**ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యన్తర చారిణౌ॥** 27

**యతేంద్రియ మనోబుద్ధిః ముని ర్మోక్షపరాయణః।**
**విగతేచ్ఛాభయ క్రోధః యస్సదా ముక్త ఏవ సః॥** 28

బాహ్య విషయాల మీద ఆలోచనలు లేకుండా, దృష్టిని కనుబొమలమధ్య నిలిపి, ముక్కు లోపల సంచరించే ప్రాణాపాన వాయువులను సమానం చేసి, ఇంద్రియాలనూ, మనస్సునూ, బుద్ధినీ వశపరచుకుని, మోక్షమే పరమ లక్ష్యంగా ఆశ, క్రోధం, భయం విడిచిపెట్టిన ముని నిరంతరమూ ముక్తుడై వుంటాడు.

భోక్తారం యజ్ఞతపసాం సర్వలోక మహేశ్వరమ్।
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తి మృచ్ఛతి॥ 29

యజ్ఞాలకూ, తపస్సులకూ భోక్తననీ, సర్వలోకాలకూ ప్రభువుననీ, సమస్త ప్రాణులకూ మిత్రుడననీ నన్ను తెలుసుకున్నవాడు పరమశాంతి పొందుతాడు.

**ఇలా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రం, శ్రీకృష్ణార్జున సంవాదం అయిన శ్రీమద్భగవద్గీతలోని 'కర్మసన్యాసయోగం' అనే ఐదవ అధ్యాయం సమాప్తం.**



## అధ్యాయ సారాంశ శ్లోకము

**విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని।**
**శునిచైవ శ్వపాకేచ పండితా స్సమ దర్శినః॥**

ఓ అర్జునా! విద్య వినయము, గలిగియున్న బ్రాహ్మణునియందు, గోవునందు, ఏనుగుయందు, కుక్కయందు కుక్క మాంసమును తినే ఛండాలుని యందు భేద భావమును చూపించక సర్వ జీవులలో నున్న ఆత్మ ఒక్కటే యని సమదృష్టి కలవారు నిజమైన ఆత్మ జ్ఞానం కలిగిన పండితులు.



# శ్రీమద్భగవద్గీత

## ఆరవ అధ్యాయం

## ఆత్మ సంయమయోగం

శ్రీ భగవానువాచ:

**అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతియః।**
**స సన్న్యాసీ చ యోగీ చన నిరగ్నిర్నచాఽక్రియః॥ 1**

శ్రీ భగవానుడు: కర్మఫలాపేక్ష లేకుండా కర్తవ్యాలను ఆచరించే వాడే నిజమైన సన్న్యాసి, యోగి అవుతాడు అంతేకాని అగ్ని హోత్రాది కర్మలు మానివేసినంత మాత్రాన కాదు.

**యం సన్న్యాస మితి ప్రాహుఃయోగం తం విద్ధి పాణ్డవ।**
**నహ్యసన్న్యస్త సజ్కల్పో యోగీ భవతి కశ్చన॥ 2**

పాండునందనా! సన్యాసమూ, కర్మయోగమూ ఒకటే అని తెలుసుకో. ఎందువల్ల నంటే సంకల్పాలను వదలిపెట్టనివాడెవడూ యోగి కాలేడు.

**ఆరురుక్షో ర్మునేర్యోగం కర్మ కారణముచ్యతే।**
**యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే॥ 3**

ధ్యానయోగాన్ని సాధించదలచిన మునికి నిష్కామకర్మయోగమే మార్గం. యోగసిద్ధిపొందినవాడికి కర్మత్యాగమే సాధనం.

**యదా హి చేన్ద్రియార్థేషు న కర్మ స్వనుషజ్జతే।**
**సర్వసఙ్కల్ప సన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే॥ 4**

ఇంద్రియ విషయాలమీదకాని, కర్మలమీదకాని అనక్తి లేకుండా సంకల్పాలన్నీ విడిచి పెట్టినవాడిని యోగారూఢుడంటారు.

**ఉద్ధరేదాత్మ నాఽఽత్మానం నాత్మాన మవసాదయేత్।**
**ఆత్మైవ హ్యాత్మనో బన్ధుః ఆత్మైవ రిపు రాత్మనః॥ 5**

తన మనస్సే తనకు బంధువూ, శత్రువూ కూడా, కనుక మానవుడు తనను తానే ఉద్ధరించుకోవాలి. తన ఆత్మను అధోగతి పాలుచేసుకోకూడదు.

**బన్ధు రాత్మా ఉ ఉత్మన స్తస్య యేనాత్మై వాత్మనా జితః।**
**అనాత్మ నస్తు శత్రుత్వే వర్తే తాత్మైవ శత్రువత్॥ 6**

మనస్సును స్వాధీనపరచుకున్నవాడికి తన మనస్సే బంధువు. మనస్సును జయించడానికి మనస్సే ప్రబల శత్రువులాగ ప్రవర్తిస్తుంది.

**జితాత్మనః ప్రశాన్తస్య పరమాత్మా సమాహితః।**
**శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః॥ 7**

ఆత్మను జయించిన ప్రశాంతచిత్తుడు పరమాత్మ సాక్షాత్కారం నిరంతరం పొందుతూ శీతోష్ణాలు, సుఖదుఃఖాలు, మానావమానాలపట్ల సమబావం కలిగిఉంటాడు.

**జ్ఞాన విజ్ఞాన తృప్తాత్మా కూటస్థో విజితేన్ద్రియః।**
**యుక్తఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాఞ్చనః॥ 8**

శాస్త్రజ్ఞానంవల్ల, అనుభవజ్ఞానంవల్ల సంతృప్తి చెందినవాడు, నిర్వికారుడు, ఇంద్రియాలను జయించినవాడు, మట్టినీ రాతినీ బంగారాన్నీ సమదృష్టితో చూసేవాడూ యోగి అని చెప్పబడతాడు.

**సుహృన్మిత్రా ర్యుదాసీన మధ్యస్థ ద్వేష్య బన్ధుషు।**
**సాధుష్వపి చ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే॥** 9

శ్రేయోభిలాషి, స్నేహితుడు, శత్రువు, ఉదాసీనుడు, మధ్యస్థుడు విరోధి, బంధువు, సాధువు, దురాచారి - వీళ్ళందరిపట్ల సమబుద్ధి కలిగినవాడే సర్వోత్తముడు.

**యోగీ యుంజీత సతతం ఆత్మానం రహసి స్థితః।**
**ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః॥** 10

యోగి ఏకాంత స్థలంలో ఒంటరిగా వుండి, ఆశలను వదలి, ఇంద్రియాలనూ మనస్సునూ వశపరచుకొని, ఏమీ పరిగ్రహించకుండా చిత్తాన్ని ఆత్మమీదే నిరంతరం నిలపాలి.

**శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః।**
**నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజిన కుశోత్తరమ్॥** 11

ఎక్కువ ఎత్తూపల్లమూ కాని పరిశుద్ధమైన ప్రదేశంలో దర్భలు పరచి, దానిమీద చర్మమూ, ఆపైన వస్త్రమూ వేసి తన స్థిరమైన ఆసనాన్ని ఏర్పరచుకోవాలి.

తత్రైకాగ్రం మనః కృత్వా యత చిత్తేన్ద్రియ క్రియః।
ఉపవిశ్యాసనే యుంజ్యాత్! యోగ మాత్మవిశుద్ధయే॥ 12

ఆ ఆసనం మీద కూర్చుని, ఇంద్రియాలనూ మనస్సునూ స్వాదీన పరచుకొని, ఏకాగ్రచిత్తంతో ఆత్మశుద్ధికోసం యోగాభ్యాసం చేయాలి.

సమం కాయ శిరో గ్రీవం ధారయ న్నచలం స్థిరః।
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్॥ 13

ప్రశాన్తాత్మా విగతభీఃబ్రహ్మచారివ్రతే స్థితః।
మన స్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః॥ 14

శరీరమూ, శిరస్సూ, కంఠమూ కదలకుండా సమంగా, స్థిరంగా ఉంచి, దిక్కులు చూడకుండా ముక్కుచివర దృష్టినిలిపి, ప్రశాంతచిత్తంతో, భయం విడిచి పెట్టి, బ్రహ్మచర్యవ్రతం అవలంబించి, మనోనిగ్రహం కలిగి, బుద్ధిని నామీదే లగ్నంచేసి, నన్నే పతిగా, గతిగా భావించి ధ్యానం చేయాలి.

యుఞ్జన్నేవం సదాऽऽత్మానం యోగీ నియత మానసః।
శాన్తిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి॥ 15

అలాంటి యోగి ఆత్మానుభవం మీద మనస్సును నిరంతరం నిలిపి, నా అధీనంలో వున్న మోక్షప్రదమైన శాంతిని పొందుతున్నాడు.

నాత్యశ్నతస్తు యోగోऽస్తి న చైకాన్తऽమనశ్నతః।
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున॥ 16

అర్జునా! అమితంగా భుజించేవాళ్ళకీ, బొత్తిగా తినని వాళ్ళకీ, అత్యధికంగా నిద్రపోయేవాళ్ళకీ అసలు నిద్రపోని వాళ్ళకీ యోగం సిద్ధించదు.

యుక్తాహార విహారస్య యుక్తచేష్టస్య కర్మసు।
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా॥ 17

ఆహార విహారాలలో, కర్మలలో, నిద్రలో, మేల్కొవడంలో పరిమితి పాటించే యోగికి సర్వదుఃఖాలూ పోయి యోగసిద్ధి కలుగుతుంది.

యదా వినియతం చిత్తం ఆత్మన్యేవావతిష్ఠతే।
నిస్పృహస్సర్వ కామేభ్యః యుక్త ఇత్యుచ్యతే తదా॥ 18

మనస్సును వశపరచుకొని ఆత్మమీదే నిశ్చలంగా నిలిపి సర్వవాంఛలూ విసర్జించినప్పుడు యోగసిద్ధి పొందుతాడని చెబుతారు.

యథా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా।
యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగ మాత్మనః॥ 19

ఆత్మయోగం అభ్యసించేవాడి మనస్సు గాలిలేనిచోట వుండేదీపంలాగా నిలకడగా వుంటుంది.

యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా।
యత్ర చైవాత్మనాఽఽత్మానం పశ్యన్నాత్మని తుష్యతి॥ 20

సుఖ మాత్యన్తికం యత్తత్ బుద్ధిగ్రాహ్య మతీన్ద్రియమ్।
వేత్తి యత్రన చైవాఽయం స్థితశ్చలతి తత్త్వతః॥ 21

యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః।
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాఽపి విచాల్యతే॥ 22

తం విద్యా ద్దుఃఖసంయోగ వియోగం యోగసంజ్ఞితమ్।
స నిశ్చయేన యోక్తవ్యః యోగో నిర్విణ్ణ చేతసా॥ 23

ఏ స్థితిలో మనస్సు యోగాభ్యాసం వల్ల నిగ్రహించబడి, శాంతిని పొందుతుందో, యోగి ఎప్పుడు పరిశుద్ధమైన మనస్సుతో పరమాత్మను తనలోనే సందర్శిస్తూ సంతోషిస్తున్నాడో, ఇంద్రియాలకు గోచరించకుండా బుద్ధివల్లనే గ్రహించబడే అనంత సుఖాన్ని అనుభవిస్తాడో, ఆత్మతత్త్వంనుంచి ఏమాత్రమూ చలించడో, దేనిని పొంది, దానికి మించిన లాభం మరొకటి లేదని భావిస్తాడో, ఏస్థితిలో స్థిరంగా వుండి దుర్భర దుస్సహ దుఃఖాని కయినా కలత చెందడో, దుః ఖాలకు దూరమైన అలాంటి దానినే యోగమంటారు. దిగులు పడకుండా దీక్షతో ఆ యోగాన్ని అభ్యసించాలి.

సఙ్కల్పప్రభవాన్ కామాన్ త్యక్త్వా సర్వానశేషతః।
మనసై వేన్ద్రియగ్రామం వినియమ్య సమన్తతః॥ 24

శనై శ్శనై రుపరమేత్ బుద్ధ్యా ధృతిగృహీతయా।
ఆత్మసంస్థం మనః కృత్వా నకిఞ్చిదపి చిన్తయేత్॥ 25

సంకల్పంవల్ల కలిగే సకలవాంఛలనూ సంపూర్ణంగా విడిచిపెట్టి, ఇంద్రియా లన్నిటినీ సమస్త విషయాలనుంచి మనస్సుతోనే మళ్ళించి, బుద్ధి ధైర్యంతో మనస్సును ఆత్మమీదే నెమ్మదిగా నిలిపి చిత్తశాంతి పొందాలి. ఏమాత్రమూ ఇతర చింతనలు చేయకూడదు.

**యతో యతో నిశ్చరతి మనశ్చఞ్చల మస్థిరమ్।**
**తతస్తతో నియమ్యైతత్ ఆత్మన్యేవ వశం నయేత్॥** **26**

చంచలమూ అస్థిరమూ అయిన మనస్సు ఏయే విషయాలమీదకు వెడుతుందో ఆయా విషయాలనుంచి దానిని మళ్లించి ఆత్మమీదే నిలకడగా వుంచాలి.

**ప్రశాన్తమనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమమ్।**
**ఉపైతి శాన్తరజసం బ్రహ్మభూత మకల్మషమ్॥** **27**

ప్రశాంతమైన మనస్సు కలిగినవాడు, కామక్రోధాది ఉద్రేక కారణాలకు అతీతుడు, పాపరహితుడు, బ్రహ్మస్వరూపుడు అయిన యోగపురుషుడికి పరమ సుఖం లభిస్తుంది.

యుఞ్జన్నేవం సదాऽऽత్మానం యోగీ విగత కల్మషః।
సుఖేన బ్రహ్మసంస్పర్శం అత్యన్తం సుఖ మశ్నుతే॥ 28

ఇలాగ మనస్సు నెప్పుడూ ఆత్మమీద లగ్నంచేసి పాపరహితుడైన యోగి అతి సులభంగా సర్వోత్కృష్టమైన సుఖం పొందుతాడు.

సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః॥ 29

యోగసిద్ధి పొందినవాడు సమస్తభూతాల పట్ల సమభావం కలిగి సర్వ భూతాలలో తన ఆత్మనూ, తన ఆత్మలో సర్వభూతాలనూ సందర్శిస్తాడు.

యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి।
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి॥ 30

అన్ని భూతాలలో నన్నూ, నాలో అన్ని భూతాలనూ చూసేవాడికి నేను లేకుండా పోను, నాకు వాడు లేకుండా పోడు.

సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వ మాస్థితః।
సర్వథా వర్తమానోऽపి స యోగీ మయి వర్తతే॥ 31

సమస్త భూతాలలో వున్న నన్ను భేదభావం లేకుండా సేవించే యోగి ఎలా జీవిస్తున్నప్పటికీ నాలోనే వుంటాడు.

**ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యో ఽ ర్జున॥**
**సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః॥ 32**

అర్జునా! సమస్తజీవుల సుఖదుఃఖాలను తనవిగా తలచేవాడు యోగులలో శ్రేష్ఠుడని నా అభిప్రాయం.

**అర్జున ఉవాచ:**

**యో ఽ యం యోగస్త్వయా ప్రోక్తః సామ్యేన మధుసూదన॥**
**ఏతస్యాహం న పశ్యామి చఞ్చలత్వాత్ స్థితిం స్థిరామ్॥ 33**

అర్జునుడు : మధుసూదనా! మనస్సునిలకడలేనిది కావడంవల్ల, నీవు ఉపదేశించిన ఈ జీవాత్మపరమాత్మల సమత్వయోగాన్ని స్థిరమైన స్థితిలో చూడలేక పోతున్నాను.

**చఞ్చలం హి మనః కృష్ణ ప్రమాథి బలవ ద్దృఢమ్।**
**తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్॥ 34**

కృష్ణా! మనస్సు చాలా చంచలం, బలవత్తరం, సంక్షోభకరం. అలాంటి మనస్సును నిగ్రహించడం వాయువును నిరోధించడంలాగ దుష్కరమని భావిస్తున్నాను.

*శ్రీ భగవానువాచ :*

**అసంశయం మహాబాహో! మనో దుర్నిగ్రహం చలమ్।**
**అభ్యాసేన తు కౌన్తేయ! వైరాగ్యేణ చ గృహ్యతే॥** 35

శ్రీ భగవానుడు : అర్జునా! మనస్సు చంచల స్వభావం కలిగింది, నిగ్రహించడానికి శక్యం కానిదీ అనడంలో సందేహం లేదు. అయితే దానిని అభ్యాసంవల్ల, వైరాగ్యంవల్ల వశపరచుకోవచ్చు.

**అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః।**
**వశ్యాత్మనా తు యతతా శక్యోవాప్తు ముపాయతః॥** 36

ఆత్మనిగ్రహం లేనివాడికి యోగం సిద్ధించదని నా వుద్దేశం. ఆత్మ నిగ్రహం వుంటే అభ్యాసం, వైరాగ్యం అనే ఉపాయాలతో యోగం పొందవచ్చు.

అర్జున ఉవాచ:

**అయతి శ్రద్ధయోపేతో యోగా చ్చలిత మానసః।**
**అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ! గచ్ఛతి॥** 37

అర్జునుడు : శ్రద్ధ వున్నప్పటికీ మనో నిగ్రహం లోపించిన కారణంగా యోగంలో చిత్తం చలించినవాడు యోగసంసిద్ధి పొందకుండా ఏ గతి పొందుతాడు?

కచ్చిన్నోభయ విభ్రష్టః ఛిన్నాభ్ర మివ నశ్యతి।
**అప్రతిష్ఠో మహాబాహో! విమూఢో బ్రహ్మణః పథి॥** 38

అర్జునుడు: కృష్ణా! మోక్ష సంపాదన మార్గంలో నిలకడ లేనివాడు ఇహపర సౌఖ్యాలు రెండింటికీ భ్రష్టుడై చెదరిన మేఘాలలాగ చెడిపోడు కదా!

**ఏతం మే సంశయం కృష్ణ! ఛేత్తుమర్హ స్యశేషతః।**
**త్వదన్యస్సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే॥** 39

కృష్ణా! ఈ నా సందేహాన్ని సంపూర్ణంగా నివారించడానికి నీవే సమర్థుడవు. ఈ సంశయాన్ని తీర్చడానికి నిన్ను మించినవాడు మరొకడెవ్వడూ లేడు.

శ్రీ భగవానువాచ

పార్థ! నైవేహ నాముత్ర వినాశఃతస్య విద్యతే।
న హి కల్యాణకృత్కశ్చిత్ దుర్గతిం తాత! గచ్ఛతి॥ 40

శ్రీ భగవానుడు: అర్జునా! యోగభ్రష్టుడికి ఈ లోకంలోకాని, పరలోకంలోకాని ఎలాంటి హానీ కలుగదు. నాయనా ! మంచిపనులు చేసిన మానవుడెపుడూ దుర్గతి పొందడు.

ప్రాప్య పుణ్యకృతాం లోకాన్ ఉషిత్వా శాశ్వతీ స్సమాః।
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽ భిజాయతే॥ 41

యోగభ్రష్టుడు పుణ్యకర్మలు చేసేవాడు పొందే ఉత్తమలోకాలు చేరి, చిర కాలం అక్కడ భోగాలు అనుభవించిన అనంతరం సదాచార సంపన్నులైన భాగ్యవంతుల యింట్లో జన్మిస్తాడు.

అథవా యోగినా మేవ కులే భవతి ధీమతామ్।
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్॥ 42

లేకపోతే బుద్ధిమంతులైన యోగుల వంశంలోనే పుడుతాడు. అయితే అలాంటి జన్మ ఈ లోకంలో పొందడం ఎంతో దుర్లభం.

తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్।
యతతే చ తతో భూయ స్సంసిద్ధౌ కురునన్దన॥ 43

అర్జునా! అలా యోగుల కులంలో పుట్టినవాడు పూర్వజన్మ సంస్కార విశేషంవల్ల సంపూర్ణయోగసిద్ధికోసం గతంలో కంటే ఎక్కువగా ప్రయత్నం కొనసాగిస్తాడు.

పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశో పి౨ సః।
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే॥ 44

పూర్వజన్మలోని అభ్యాసబలం మూలంగా ఆ యోగభ్రష్టుడు తాను తలపెట్టక పోయినా మళ్ళీ యోగసాధనవైపుకు లాగబడుతాడు. యోగస్వరూపాన్ని తెలుసుకోదలచిన వాడుకూడా వేదాలలో వివరించబడ్డ కర్మలు ఆచరించే వాడిని మించిపోతాడు.

ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధ కిల్బిషః।
అనేకజన్మ సంసిద్ధఃతతో యాతి పరాం గతిమ్॥ 45

పట్టుదలతో ప్రయత్నించే యోగి పాపవిముక్తుడై అనేక జన్మలకు సంబంధించిన సాధనాసంపర్కంవల్ల యోగసిద్ధి, తరువాత మోక్షఫలం పొందుతాడు.

**తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః।**
**కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున॥ 46**

అర్జునా! తపస్సు చేసేవాళ్ళకంటే, శాస్త్రజ్ఞానం కలవాళ్ళకంటే, యోగులకంటే ధ్యానయోగి గొప్పవాడు. కనుక నీవు ధ్యానయోగం సాధించాలి.

**యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా।**
**శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః॥ 47**

యోగులందరిలోనూ మనస్సు నామీదే నిలిపి, శ్రద్ధాభక్తులతో నన్ను సేవించేవాడే ఉత్తముడని నా వుద్దేశం.

**ఇలా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రం, శ్రీకృష్ణార్జున సంవాదం అయిన శ్రీమద్భగవద్గీతలోని 'ఆత్మసంయమ యోగం' అనే ఆరవ అధ్యాయం సమాప్తం.**

## అధ్యాయ సారాంశ శ్లోకము

**ఉద్ధరేదాత్మనా ఽ ఽ త్మానం ఆత్మానయవసాదయేత్।**
**ఆత్మైవహ్యాత్మనో బంధుః ఆత్మైవ రిపురాత్మనః॥**

ఓ అర్జునా! ఈ ప్రపంచంలో ప్రతిజీవి తన్ను తానే ఉద్ధరించుకోవాలి. (అంటే రక్షించుకోవాలి) భగవంతుడు ఏదో చేస్తాడని బద్ధకించి ఏ పని చేయకుండా ఉన్నవాడిని భగవంతుడు రక్షించడు. ఇంద్రియాలను జయించి స్వాధీనపరచుకున్న వాడు తనకు తానే బంధువవుతాడు. ఇంద్రియాలకు బానిస అయినవాడు తనకు తానే శత్రువవుతాడు.



# శ్రీమద్భగవద్గీత

## ఏడవ అధ్యాయం

## విజ్ఞానయోగం

*శ్రీ భగవానువాచ :*

**మయ్యాసక్తమనాః పార్థ! యోగం యుఞ్జన్మదాశ్రయః।**
**అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు॥ 1**

శ్రీ భగవానుడు: అర్జునా మనస్సు నామీదే నిలిపి నన్నే ఆశ్రయించి, ధ్యానయోగాన్ని ఆచరిస్తూ సంశయం లేకుండా, సమగ్రంగా నన్ను ఎలా తెలుసుకోగలవో వివరిస్తాను విను.

**జ్ఞానం తేఽహం సవిజ్ఞానం ఇదం వక్ష్యామ్యశేషతః।**
**యద్ జ్ఞాత్వానేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్య మవశిష్యతే॥ 2**

బ్రహ్మజ్ఞానాన్ని గురించి నేను నీకు (స్వానుభవంతో) సంపూర్ణంగా చెబుతాను. దీనిని గ్రహిస్తే ఈలోకంలో నీవు మళ్ళీ తెలుసుకోదగిందేమీ వుండదు.

**మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే।**
**యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః॥ 3**

ఎన్నో వేలమందిలో ఏ ఒక్కడో యోగసిద్ధి కోసం ప్రయత్నిస్తాడు. అలా ప్రయత్నించి, సాధకులైన వాళ్ళలో కూడా నన్ను నిజంగా తెలుసుకున్న వాడు ఏ ఒక్కడో వుంటాడు.

**భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ।**
**అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా॥ 4**

నా మాయాశక్తి ఎనిమిది విధాలుగా విభజించబడింది. అవి. భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారం.

**అపరేయమిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్।**
**జీవభూతాం మహాబాహో! యయేదం ధార్యతే జగత్॥ 5**

అర్జునా! ఇప్పుడు చెప్పింది అపరప్రకృతి. జీవరూపమై ఈ జగత్తునంతటినీ దరిస్తున్న నా మరో ప్రకృతి ఇంతకంటే మరి యొకటి కలదని తెలుసుకో.

**ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ।**
**అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయస్తథా॥ 6**

నా ఈ రెండు ప్రకృతులనుంచే సమస్త భూతాలూ పుడుతున్నాయని గ్రహించు. అందువల్ల సర్వజగత్తూ ఆవిర్భవించడానికీ, అంతం కావడానికీ కారణం నేనే.

**మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ।**
**మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ॥ 7**

ధనంజయా! నా కంటే ఉత్కృష్టమైన దేదీ లేదు. దారం హారంగా మణులను కలిపి నిలిపినట్లు నేనే ఈ సమస్త జగత్తునీ ధరిస్తున్నాను.

**రసో ఽ హమప్సు కౌంతేయ! ప్రభా ఽ స్మి శశిసూర్యయోః।**
**ప్రణవస్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు॥ 8**

కౌంతేయా! నేను నీటిలో రుచిగా, సూర్యచంద్రులలో కాంతిగా, సర్వ వేదాలలో ఓంకారంగా, ఆకాశంలో శబ్దంగా, నరులలో పురుషకారంగా వున్నాను.

పుణ్యో గంధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ।
జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు॥ 9

నేలలోని సుగంధం, నిప్పులోని తేజస్సు, సర్వభూతాలలోని ఆయుస్సు, తపోధనులలోని తపస్సు నేనే.

బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ! సనాతనమ్।
బుద్ధిర్బుద్ధిమతామస్మి తేజస్తేజస్వినామహమ్॥ 10

పార్థా! సమస్త జీవులకూ మూలకారణం నేనే అని తెలుసుకో. బుద్ధిమంతులలోని బుద్ధీ, తేజోవంతులలోని తేజస్సూ నేనే.

బలం బలవతాం చాహం కామరాగవివర్జితమ్।
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ॥ 11

బలవంతులలోని ఆశ, అనురాగం లేని బలాన్ని నేను. ప్రాణులలోని ధర్మవిరుద్ధం కాని కామాన్నీ నేనే.

యే చైవ సాత్త్వికా భావాః రాజసాస్తామసాశ్చ యే।
మత్త ఏవేతి తాన్విద్ధి న త్వహం తేషు తే మయి॥ 12

సాత్త్విక, రాజసిక, తామసిక భావనలన్నీ నా వల్లనే కలిగాయని తెలుసుకో. వాటిలో నేను లేను, నాలో అవివున్నాయి.

**త్రిభిర్గుణమయై ర్భావైః ఏభిస్సర్వమిదం జగత్।**
**మోహితం నాభిజానాతి మామేభ్యః పర మవ్యయమ్॥ 13**

ఈ మూడు గుణాల ప్రభావంవల్ల ప్రపంచమంతా భ్రమచెంది, వాటికంటే విలక్షనుడిగా, వినాశం లేనివాడిగా నన్ను గ్రహించలేకపోయినది.

**దైవీహ్యేషా గుణమయీ మమమాయా దురత్యయా।**
**మామేవయే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే॥ 14**

త్రిగుణ స్వరూపమైన ఈ నా దైవమాయను దాటడం సామాన్యులకు సాధ్యపడదు. అయితే నన్నే ఆశ్రయించినవాళ్ళు దానిని అతిక్రమిస్తారు.

**న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః।**
**మాయయాఽ పహృతజ్ఞానాః ఆసురం భావ మాశ్రితాః॥ 15**

పాపాత్ములు, మూఢులు, మానవాధములు, మాయలోపడి వివేకం కోల్పోయినవాళ్ళు, రాక్షసభావాలను ఆశ్రయించినవాళ్ళు నన్ను పొందలేరు.

చతుర్విధా భజంతే మాం జనా స్సుకృతినో ఽ ర్జున॥
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ॥ 16

అర్జునా! నన్ను సేవించే పుణ్యపురుషులు నాలుగురకాలు. ఆపదలో వున్నవాడు, ఆత్మత్త్వం తెలుసుకోగోరేవాడు, సిరిసంపదలు కోరేవాడు, ఆత్మజ్ఞానం కలిగినవాడు.

తేషాం జ్ఞానీ నిత్యయుక్తః ఏకభక్తి ర్విశిష్యతే।
ప్రియో హి జ్ఞానినో ఽ త్యర్థం అహం స చ మమ ప్రియః॥ 17

ఈ నలుగురిలో నిత్యమూ భగవంతుణ్ణి భక్తితో భజించే ఆత్మజ్ఞాని అత్యుత్తముడు. అలాంటి జ్ఞానికి నేనూ, నాకు అతనూ ఎంతో ప్రియులం కావడమే దీనికి కారణం.

ఉదారాస్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్।
ఆస్థితస్స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్॥ 18

వీళ్ళంతా గొప్పవాళ్ళే అయినప్పటికీ జ్ఞానిమాత్రం నా ఆత్మస్వరూపుడే అని నా అభిప్రాయం. ఎందువల్లనంటే అతను నన్నే పరమగతిగా భావించి సేవిస్తాడు.

**బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే।**
**వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః॥ 19**

అనేక జన్మలలో ఆచరించిన పుణ్యకర్మల ఫలితంగా జ్ఞాని చివర జగత్తు సర్వమూ వాసుదేవమయం అనే జ్ఞానంతో నన్నాశ్రయిస్తాడు. ఈ లోకంలో అలాంటి మహానుబావులు చాలా అరుదు.

**కామై సై ర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽ న్యదేవతాః।**
**తం తం నియమమాస్థాయ ప్రకృత్యా నియతా స్స్వయా॥ 20**

తమ తమ పూర్వ జన్మ సంస్కారాలకు సంబంధించిన కోరికల మూలంగా వివేకం కోల్పోయిన కొందరు, ఇతర దేవతలను వాళ్ళకు తగిన నియమాలతో ఉపాసిస్తున్నారు.

**యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయాఽ ర్చితు మిచ్ఛతి।**
**తస్య తస్యా చలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్॥ 21**

ఏ భక్తుడు ఏ దేవతామూర్తిని పూజించ కోరుతున్నాడో, అతనికి ఆ దేవతామూర్తి పట్ల అచంచలమైన శ్రద్ధ నేను కలగజేస్తాను.

**స తయా శ్రద్ధయా యుక్తః తస్యారాధన మీహతే।**
**లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్హితాన్॥ 22**

అలాంటి శ్రద్ధాభక్తులతో ఆ దేవతామూర్తిని ఆరాధించినవాడు నేను కలగజేసే కామితార్థాలనే ఆ దేవతద్వారా పొందుతున్నాడు.

**అంతవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్।**
**దేవాన్దేవయజో యాంతి మద్భక్తా యాంతి మామపి॥ 23**

మందబుద్ధులైన ఈ మానవులు పొందే ఫలితాలు అశాశ్వతాలు. దేవతలను అర్చించేవాళ్ళు దేవతలనే పొందుతారు. నా భక్తులు మాత్రం నన్ను పొందుతారు.

**అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యంతే మా మబుద్ధయః।**
**పరం భావమజానంతో మమా వ్యయ మనుత్తమమ్॥ 24**

అవివేకులు శాశ్వతం. సర్వోత్తమం అయిన నా స్వరూపాన్ని గుర్తించలేక నన్ను మానవమాత్రుడిగా తలుస్తారు.

**నాహం ప్రకాశ స్సర్వస్య యోగమాయా సమావృతః।**
**మూఢో౽ యం నాభిజానాతి లోకో మామజ మవ్యయమ్॥ 25**

యోగమాయచేత కప్పబడివున్న నేను అందరికి కనబడడం లేదు. మూఢ ప్రపంచం నన్ను పుట్టుక, నాశనం లేనివాడనీ తెలుసుకోలేక పోతున్నది.

**వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున॥**
**భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన॥** 26

అర్జునా! భూతభవిష్యద్వర్తమాన కాలాలకు సంబంధించిన జీవులందరు నాకు తెలుసు. అయితే నేను ఏ ఒక్కడికీ తెలియను.

**ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వంద్వమోహేన భారత॥**
**సర్వభూతాని సమ్మోహం సర్గే యాంతి పరంతప॥** 27

పరంతపా! సమస్త భూతాలు పుట్టుకతోనే అనురాగ ద్వేషాల మూలంగా కలిగే సుఖదుఃఖాదులవల్ల మోహంలో మునిగి, అజ్ఞానంలో పడుతున్నాయి.

**యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్।**
**తే ద్వంద్వమోహ నిర్ముక్తాః భజంతే మాం దృఢవ్రతాః॥** 28

పుణ్యకర్మలు చేసి సకలపాపాలనూ పోగొట్టుకున్న మహానుభావులు సుఖ దుఃఖ రూపమైన మోహాలనుంచి విముక్తులై గట్టిపట్టుదలతో నన్ను భజిస్తారు.

**జరామరణ మోక్షాయ మామాశ్రిత్య యతంతి యే।**
**తే బ్రహ్మ తద్విదుః కృత్స్నం అధ్యాత్మం కర్మ చాఖిలమ్॥ 29**

ముసలితనం, మృత్యువులనుంచి ముక్తి పొందడానికి నన్ను ఆశ్రయించి, ప్రయత్నించేవాళ్ళు పరబ్రహ్మతత్వాన్నీ, ఆత్మస్వరూపాన్నీ, సమస్త కర్మలనూ గ్రహించగలుగుతారు.

**సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చయే విదుః।**
**ప్రయాణకాలేऽపి చ మాం తే విదు ర్యుక్తచేతసః॥ 30**

అధిభూతమూ, అధిదైవమూ, అధియజ్ఞాలతో కూడిన నా రూపాన్ని తెలిసినవాళ్ళు మరణకాలంలో కూడా నన్ను మరచిపోరు.

**ఇలా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రం, శ్రీకృష్ణార్జున సంవాదం అయిన శ్రీమద్భగవద్గీతలోని 'విజ్ఞానయోగం' అనే ఏడవ అధ్యాయం సమాప్తం.**



## అధ్యాయ సారాంశ శ్లోకము

**బహూనాం జన్మ నామంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే।**
**వాసుదేవస్సర్వ మితి సమహాత్మా సుదుర్లభః॥**

ఓ అర్జునా! అనేక జన్మలలో సంపాదించుకొన్న జ్ఞానంవలన భగవదనుగ్రహంవల్ల ఏదో ఒకప్పుడు ఈ జీవి మహాజ్ఞానిగా పుడతాడు. అట్టి మహాజ్ఞానియే చివరకు నన్ను చేరుతాడు. కాని సమస్త జగత్తు వాసుదేవమయము- (అంటే భగవంతునితో నిండి ఉన్నది) అను జ్ఞానమును పొందిన మహాత్ముడు ఈ లోకములో ఉండుట చాలా కష్టము.



# శ్రీమద్భగవద్గీత

## ఎనిమిదవ అధ్యాయం

### అక్షరపరబ్రహ్మయోగం

**అర్జున ఉవాచ :**

**కిం త ద్బ్రహ్మ కి మధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ॥**
**అధిభూతం చ కిం ప్రోక్తం అధిదైవం కిముచ్యతే?॥ 1**

అర్జునుడు: పురుషోత్తమా! బ్రహ్మమంటే ఏమిటి? అధ్యాత్మమంటే ఏమిటి? కర్మ అంటే ఏమిటి? అధిభూతమూ, అధిదైవమూ అనేవి ఏవి?

**అధియజ్ఞః కథం కోఽ త్ర దేహేఽ స్మిన్ మధుసూదన॥**
**ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽ సి నియతాత్మభిః॥ 2**

మధుసూదనా! ఈ శరీరంలో అధియజ్ఞు డెవడు. ఎలా వుంటాడు? మనో నిగ్రహం కలవాళ్ళు మరణసమయంలో నిన్నెలా తెలుసుకోగలుగుతారు?

శ్రీ భగవానువాచ :

**అక్షరం బ్రహ్మ పరమం స్వభావో౽ ధ్యాత్మ ముచ్యతే।**
**భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః॥** 3

శ్రీ భగవానుడు: సర్వోత్తమం, శాశ్వతమూ అయిన పరమాత్మనే బ్రహ్మమనీ, ఆత్మ పరమాత్మతత్త్వాన్ని అధ్యాత్మమనీ చెబుతారు. సమస్తజీవుల ఉత్పత్తికీ, ఉనికికీ కారణమైన త్యాగపూర్వం, యజ్ఞరూపం అయిన కార్యమే కర్మ.

**అధిభూతం క్షరో భావః పురుషశ్చాధిదైవతమ్।**
**అధియజ్ఞో౽ హ మేవాత్ర దేహే దేహభృతాం వర!॥** 4

అర్జునా! శరీరంలాంటి నశించే స్వబావం కలిగిన పదార్థాలను అధిభూత మంటారు. పురుషుడే అధిదైవం ఈ దేహంలో అంతర్యామి రూపంలో వుండే అధియ జ్ఞాని నేనే.

**అంతకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కళేబరమ్।**
**యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః॥** 5

మరణసమయంలో నన్నే స్మరణచేస్తూ శరీరాన్ని విడిచిపెట్టినవాడు నా స్వరూపాన్నే పొందుతాడు. ఇందులో సందేహమేమీ లేదు.

యం యం వా పి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరమ్।
**తం తమేవైతి కౌంతేయ! సదా తద్భావభావితః॥** 6

కౌంతేయా! అంత్యకాలంలో ఎవడు ఏ భావాలతో శరీరాన్ని వదులుతాడో, ఆ బావాలను తగిన స్థితినే పొందుతాడు.

**తస్మా త్సర్వేషు కాలేషు మామనుస్మర యుద్ధ్య చ।**
మయ్యర్పిత మనోబుద్ధిః మా మేవైష్యస్యసంశయః॥ 7

అందువల్ల నిరంతరం నన్నే స్మరిస్తూ యుద్ధం చెయ్యి. మనస్సునూ, బుద్ధినీ నాకు అర్పిస్తే నీవు నిస్సంశయంగా నన్నే పొందుతావు.

**అభ్యాస యోగయుక్తేన చేతసా నాన్యగామినా।**
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్॥ 8

పార్థా! మనస్సును ఇతర విషయాల మీదకు పోనీయకుండా యోగం అభ్యసిస్తూ పరమపురుషుడైన భగవానుణ్ణి నిరంతరం ధ్యానించేవాడు ఆయననే పొందగలుగుతాడు.

**కవిం పురాణ మనుశాసితారం అణోరణీయాంసమనుస్మరే ద్యః।**
**సర్వస్య ధాతార మంచిత్య రూపం ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్॥** 9

**ప్రయాణకాలే మనసాచలేన భక్త్యా యుక్తో యోగబలేన చైవ।**
**భ్రువోర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్ సతం పరం పురుష ముపైతి దివ్యమ్॥10**

సర్వమూ తెలిసినవాడు, సనాతనుడు, సకలలోకానూ శాసించేవాడు, సూక్ష్మాతి సూక్ష్మమైనవాడు, సూర్యుడులాంటి కాంతి కలిగినవాడు, అఖిల జగత్తుకూ ఆధారమైనవాడు, ఆలోచించడానికి శక్యంకాని రూపం కలిగినవాడు అజ్ఞానాంధ కారానికి అతీతుడు అయిన పరమేశ్వరుణ్ణి మరణకాలంలో మనస్సు నిశ్చలంగా వుంచుకొని భక్తిభావంతో, యోగబలంతో కనుబొమల మధ్య ప్రాణవాయువును బాగా నిలిపి ధ్యానించేవాడు ఆ దివ్యపురుషుణ్ణి పొందుతాడు.

**యదక్షరం వేదవిదో వదంతి విశన్తి యద్యతయో వీతరాగాః।**
**యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరంతి తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే॥ 11**

వేదార్థం తెలిసినవాళ్ళు శాశ్వతమని చెప్పేది. కామక్రోధాలను జయించిన యోగులు చేరేదీ, బ్రహ్మచర్యాన్ని పాటించేవాళ్ళు చేరకోరేదీ అయిన పరమపదాన్ని గురించి నీకు క్లుప్తంగా చెబుతాను విను.

**సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ।**
**మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణం ఆస్థితో యోగధారణామ్॥ 12**

**ఓమిత్యేకాక్షరంబ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్।**
**యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్॥ 13**

ఇంద్రియాలన్నిటినీ నిగ్రహించి, మనస్సును హృదయంలో నిలిపి, ప్రాణం శిరస్సులో వుంచి, ఆత్మయోగం అభ్యసిస్తూ బ్రహ్మను ప్రతిపాదించే ఓంకారమనే ఒక్క అక్షరాన్ని ఉచ్చరిస్తూ, నన్నే స్మరిస్తూ శరీరాన్ని విడిచి పెట్టేవాడు మోక్షం పొందుతాడు.

**అనన్యచేతాస్సతతం యో మాం స్మరతి నిత్యశః।**
**తస్యాహం సులభః పార్థ! నిత్యయుక్తస్య యోగినః॥ 14**

పార్థా! ఏకాగ్రచిత్తంతో ఎల్లప్పుడూ నన్నే స్మరించే ధ్యానయోగికి నేను అతి సులభంగా లభిస్తాను.

**మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్।**
**నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః॥ 15**

మోక్షపదాన్ని పొందిన మహాత్ములు నన్నుచేరి, దుఃఖపూరితం, అశాశ్వతమూ అయిన పునర్జన్మ పొందరు.

**ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున!**
**మాముపేత్య కౌంతేయ! పునర్జన్మ న విద్యతే॥ 16**

కౌంతేయా! బ్రహ్మలోకంవరకూ వుండే సకలలోకాలూ పునర్జన్మ కలగజేసేవే. నన్ను పొందినవాళ్ళకు మాత్రం మరోజన్మ లేదు.

సహస్రయుగపర్యంతం **అహర్యద్బ్రహ్మణో విదుః।**
**రాత్రిం యుగసహస్రాంతాం తేఽహోరాత్రవిదో జనాః॥ 17**

బ్రహ్మదేవుడికి వేయియుగాలు పగలనీ, ఇంకో వేయియుగాల కాలం రాత్రి అనీ తెలుసుకున్నవాళ్ళే రాత్రింబవళ్ళు తత్త్వాన్ని గ్రహిస్తారు.

**అవ్యక్తాత్వ్యక్తయ స్సర్వాః ప్రభవంత్యహరాగమే।**
**రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రైవావ్యక్త సంజ్ఞకే॥ 18**

బ్రహ్మదేవుడి పగటి సమయంలో చరాచర వస్తువులన్నీ వ్యక్త ప్రకృతి నుంచి కలుగుతాయి. మళ్ళీ రాత్రి కావడంతోనే అవ్యక్తం అనబడే ఆ ప్రకృతిలోనే కలసిపోతాయి.

**భూతగ్రామ స్స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే।**
**రాత్ర్యాగమేఽ వశః పార్థ! ప్రభవ త్యహరాగమే॥ 19**

పార్థా! ఈ జీవకోటి పుట్టి పుట్టి బ్రహ్మకు రాత్రి రావడంతోనే ప్రకృతిలో లీనమవుతుంది. పగలు కాగానే మళ్ళీ పుడుతుంది.

**పరస్తస్మాత్తు భావోఽ న్యోఽ వ్యక్తోఽ వ్యక్తాత్సనాతనః।**
**య స్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి॥ 20**

ఈ అవ్యక్తప్రకృతికి అతీతమై, అగోచరం, శాశ్వతమూ అయిన పరబ్రహ్మ తత్వం సమస్తభూతాలూ నశించినా నశించదు.

**అవ్యక్తో.క్షర ఇత్యుక్తః తమాహుః పరమాం గతిమ్।**
**యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ॥ 21**

అగోచరుడనీ, శాశ్వతుడనీ చెప్పే ఆ పరమాత్మనే పరమగతిగా భావిస్తారు. నాకు నిలయమైన పరమపదాన్ని పొందినవాళ్ళకు మళ్ళీ జన్మలేదు.

**పురుషస్స పరః పార్థ! భక్త్యా లభ్య స్త్వనన్యయా।**
**యస్యాంతస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్॥ 22**

అర్జునా! సమస్తభూతాలనూ తనలో ఇముడ్చుకొని, సకలలోకాలలో వ్యాపించి వున్న పరమాత్మను అచంచలమైన భక్తి వల్లనే పొందవచ్చు.

**యత్ర కాలే త్వనావృత్తిం ఆవృత్తిం చైవ యోగినః।**
**ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ!** 23

భరతవీరా! యోగులు ఏ సమయంలో మరణిస్తే మళ్ళీ జన్మించరో, ఏవేళ దేహం విడిచిపెడితే పునర్జన్మ పొందుతారో చెబుతాను విను.

**అగ్నిర్జ్యోతి రహ శ్శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్।**
**తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః॥** 24

అగ్ని, జ్యోతి, పగలు, శుక్లపక్షం, ఆరుమాసాల ఉత్తరాయణం - వీటిలో మరణించే బ్రహ్మోపాసకులకు బ్రహ్మప్రాప్తి కలుగుతుంది.

**ధూమో రాత్రి స్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్।**
**తత్ర చాంద్రమసం జ్యోతిః యోగీ ప్రాప్య నివర్తతే॥** 25

పొగ, రాత్రి, కృష్ణపక్షం, ఆరుమాసాల దక్షిణాయనంలలో గతించిన యోగి చంద్రజ్యోతిని పొంది, మళ్ళీ మానవలోకంలోకి వస్తాడు.

శుక్లకృష్ణగతీ హ్యేతే జగత శ్శాశ్వతే మతే।
ఏకయా యాత్యనావృత్తిం అన్యయా వర్తతే పునః॥ 26

శుక్ల, కృష్ణ అనే రెండింటినీ జగత్తులో శాశ్వతమార్గాలుగా భావిస్తున్నారు. శుక్లమార్గంలో పయనించిన వాడికి జన్మరాహిత్యమూ, కృష్ణమార్గంలో పోయినవాడికి పునర్జన్మమూ కలుగుతాయి.

నైతే సృతీ పార్థ! జానన్ యోగీ ముహ్యతి కశ్చన।
తస్మా త్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున!॥ 27

పార్థా ! ఈ రెండుమార్గాలూ తెలిసిన యోగి ఎవడూ మోహంలో పడడు. అందువల్ల నీవు నిరంతరం ధ్యానయోగంలో వుండు.

వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్।
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా యోగీ పరం స్థానముపైతి చాద్యమ్॥ 28

దీనినంతా గ్రహించిన యోగి వేదాలు, యజ్ఞాలు, తపస్సులు, దానాలకు చెప్పబడ్డ పుణ్యఫలాలను అధిగమించి, అనాది అయిన పరమపదం పొందుతాడు.

ఇలా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోశాస్త్రం, శ్రీకృష్ణార్జున సంవాదం అయిన శ్రీమద్భగవద్గీతలోని 'అక్షరపరబ్రహ్మయోగం' అనే ఎనిమిదవ అధ్యాయం సమాప్తం.

## అధ్యాయ సారాంశ శ్లోకము

**అంతకాలేచ మా మేవ స్మరన్ముక్త్వా కళేబరమ్।**
**యః ప్రయాతి సమద్భావం యాతి నాస్త్యత్ర సంశయః॥**

ఓ అర్జునా! ప్రతినిత్యము నన్నే స్మరిస్తూ ఎవరైతే మరణ సమయంలో కూడా నా నామాన్నే జపిస్తూ శరీరాన్ని వదిలిపెడతారో వారు తప్పక నన్నే పొందు తారు. ఎలాంటి సందేహము లేదు.



# శ్రీమద్భగవద్గీత

## తొమ్మిదవ అధ్యాయం

## రాజవిద్యా రాజగుహ్యయోగం

*శ్రీ భగవానువాచ*

ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే।
జ్ఞానం విజ్ఞాన సహితం యత్‌జ్ఞాత్వా మోక్ష్యసే౽ శుభాత్॥ 1

శ్రీ భగవానుడు: అశుభకరమైన సంసారబంధంనుంచి విముక్తి పొందడానికి తెలుసుకోవలసిన అతిరహస్యం, అనుభవసహితమూ అయిన జ్ఞానాన్ని అసూయ లేని నీకు ఉపదేశిస్తున్నాను.

రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిదముత్తమమ్।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్॥ 2

విద్యలలో ఉత్తమమం, పరమరహస్యం, పవిత్రమూ అయిన ఈ బ్రహ్మ జ్ఞానం ప్రత్యక్షానుభవం వల్ల తెలుసుకోదగ్గది. ఇది ధర్మయుతం, శాశ్వతం సులభసాధ్యం.

**అశ్రద్ధధానాః పురుషాః ధర్మస్యాస్య పరంతప।**
**అప్రాప్య మాం నివర్తంతే మృత్యు సంసార వర్త్మని॥** 3

అర్జునా! ఈ ధర్మంపట్ల శ్రద్ధలేని పురుషులు నన్ను పొందకుండా మరణ రూపమైన సంసారపథంలో పరిభ్రమిస్తారు.

**మయా తత మిదం సర్వం జగదవ్యక్తమూర్తినా।**
**మత్ స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః॥** 4

ఇంద్రియాలకు కనిపించని నా రూపం ఈ విశ్వమంతా వ్యాపించి వున్నది. సకలజీవులూ నాలో వున్నాయి. నేను మాత్రం వాటిలో లేను.

**నచ మత్‌స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్।**
**భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః॥** 5

ఈశ్వర సంబంధమైన నా యోగశక్తి చూడు. భూతాలు నాలో లేవు. నా ఆత్మ సమస్త భూతాలనూ సృష్టించి, పోషిస్తున్నప్పటికీ వాటిలో వుండదు.

**యథాఽఽకాశస్థితో నిత్యం వాయు స్సర్వత్రగో మహాన్।**
**తథా సర్వాణి భూతాని మత్ స్థానీత్యుపధారయ॥** 6

సర్వత్రా సంచరించే మహావాయువు ఆకాశంలో నిరంతరం నిలిచి వున్నట్లే సర్వభూతాలూ నాలో వున్నాయని తెలుసుకో.

**సర్వభూతాని కౌంతేయ! ప్రకృతిం యాంతి మామికామ్।**
**కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్॥ 7**

కౌంతేయా!ప్రళయకాలంలో ప్రాణికోటులన్నీ నా ప్రకృతిలో ప్రవేశిస్తున్నాయి. సృష్టికాలంలో వాటిని మళ్ళీ నేను సృజిస్తున్నాను.

**ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః।**
**భూతగ్రామ మిమం కృత్స్నం అవశం ప్రకృతే ర్వశాత్॥ 8**

ప్రకృతికి అధీనమై, అస్వంతంత్రమైన సకల భూతసంఘాలన్నిటినీ స్వాధీనంలో వుంచుకున్న నా ప్రకృతితో మళ్ళీ మళ్లీ సృష్టిస్తుంటాను!

**న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ!।**
**ఉదాసీనవదాసీనం అసక్తం తేషు కర్మసు॥ 9**

అయినప్పటికీ అర్జునా! వాటిపై ఆసక్తిలేని తటస్థుణ్ణి కావడం వల్ల ఈ కర్మలు నన్ను బంధించలేవు.

మయాఽ ధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్।
హేతునాఽ నేన కౌంతేయ! జగద్విపరివర్తతే॥ 10

కౌంతేయా! ప్రకృతి నా పర్యవేక్షణలో ఈ చరాచర జగత్తును సృష్టిస్తున్నది. అందువల్లనే అవిచ్ఛినంగా జగన్నాటకం జరుగుతున్నది.

అవజానంతి మాం మూఢాః మానుషీం తనుమాశ్రితమ్।
పరంభావ మజానంతో మమ భూతమహేశ్వరమ్॥ 11

సమస్త ప్రాణకోటికి ప్రభువైన నా పరమాత్మత్త్వం తెలియని మూఢులు మానవరూపంలో వున్న నన్ను మామూలు మనిషిగా భావించి అవమానిస్తున్నారు.

మోఘాశాః మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః।
రాక్షసీమాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః॥ 12

అలాంటి మూఢులు పనికిమాలిన కాంక్షలూ, కర్మలూ, జ్ఞానమూ కలిగి వివేకం కోల్పోయి రాక్షసుల స్వభావాన్ని అశ్రయిస్తారు.

మహాత్మానస్తు మాం పార్థ! దైవీం ప్రకృతిమాశ్రితాః।
భజంత్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్॥ 13

పార్థా! సాత్త్వికస్వభావం కలిగిన మహాత్ములు సర్వభూతాలకూ ఆది కారణమైన వాడిగా, నాశనం లేని వాడినిగా నన్ను తెలుసుకొని ఏకాగ్రచిత్తంతో సేవిస్తారు.

**సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః।**
**నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే॥ 14**

వాళ్ళలో కొంతమంది నిరంతరం నన్ను కీర్తిస్తూ, దృఢవ్రతంతో ప్రయత్నిస్తూ భక్తితో నాకే నమస్కరిస్తూ మనస్సు నామీదే నిలిపి నన్ను ఉపాసిస్తారు.

**జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజంతో మాముపాసతే।**
**ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్॥ 15**

మరికొంతమంది మహాత్ములు విశ్వరూపంలో వున్న నన్ను జ్ఞానయజ్ఞంతో సేవిస్తారు. అనేక భావాలతో నేను ఒక్కడినే అనీ, వేరే వ్యక్తిననీ, బహురూపాలు కలిగినవాడిననీ భజిస్తారు.

**అహం క్రతు రహం యజ్ఞః స్వధా௨ హ మహ మౌషధమ్।**
**మంత్రో௨ హ మహమేవాజ్యం అహ మగ్ని రహం హుతమ్॥ 16**

క్రతువూ, యజ్ఞమూ, పితృదేవతలకు అర్పించే అన్నమూ, ఔషధమూ, మంత్రమూ, నేయీ, నిప్పూ, హోమమూ నేనే.

**పితా హ మస్య జగతో మాతా ధాతా పితామహః।**
**వేద్యం పవిత్ర మోంకారః ఋక్సామయజురేవ చ॥** 17

ఈ జగత్తుకు తండ్రి, తల్లి, కర్మఫలదాత, తెలుసుకోదగ్గ వస్తువు నేనే, ఓంకారం, ఋగ్వేదం, సామవేదం, యజుర్వేదం కూడా నేనే.

**గతి ర్భర్తా ప్రభుస్సాక్షీ నివాస శ్శరణం సుహృత్।**
**ప్రభవః ప్రళయః స్థానం నిధానం బీజ మవ్యయమ్॥** 18

ఈ జగత్తుకు గతి, పతి, ప్రభువు, సాక్షి, నివాసస్థానం, ఆశ్రయం, ఆప్తుడు, సృష్టికర్త, సంహారకుడు, ఆధారం, ప్రళయం, స్థానం, శాశ్వతబీజం నేనే.

**తపామ్యహ మహం వర్షం నిగృహ్ణా మ్యుత్సృజామి చ।**
**అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహమర్జున॥** 19

**అర్జునా! నేనే వేడి కలగజేస్తున్నాను. వర్షాన్ని నిలుపుచున్నాను. కురిపిస్తున్నాను. అమృతమూ, మృత్యువూ నేనే. శాశ్వతమైన సత్తూ, అశాశ్వతమైన అసత్తూ నేనే.**

**త్రైవిద్యా మాం సోమపాః పూతపాపాః**
**యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే।**
**తే పుణ్య మాసాద్య సురేంద్రలోకం**
**అశ్నంతి దివ్యాన్దివి దేవభోగాన్॥ 20**

మూడు వేదాలు చదివినవారు యజ్ఞాలతో నన్ను పూజించి, సోమపానం చేసి, పాపాలు పోగొట్టుకొని స్వర్గం కోరుతారు. అలాంటివాళ్ళు పుణ్యఫలమైన దేవేంద్రలోకాన్ని పొంది, దివ్యభోగాలు అనుభవిస్తుంటారు.

**తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం**
**క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి।**
**ఏవం త్రయీ ధర్మమనుప్రపన్నాః**
**గతాగతం కామకామా లభంతే॥ 21**

వాళ్ళు విశాలమైన స్వర్గలోకంలో సుఖాలు అనుభవించి, పుణ్యం క్షీణించిపోగానే మానవలోకంలో మళ్ళీ ప్రవేశిస్తారు. ఇలా వేదంలోని కర్మ కాండను పాటించే భోగపరాయణులు జననమరణాలు పొందుతుంటారు.

